


సంపుటం : ౧. ప్రమాది, మార్గశిరము : డిశంబరు, 1939. సంచిక : ౫.

# సంపాదకీయ సమాలోచన

### ౧. కాంగ్రెస్ మంత్రుల రాజీనామాలు : నాయకుల అభిప్రాయాలు :—

కాంగ్రెస్ మంత్రులు రాజీనామాలు ఇచ్చి ఇప్పటికి నెలపైగా ఐనది. ఐనా రాజీనామాల విషయంలో ఇంకా నాయకులు వివిధాభిప్రాయాలు వెలిబుచ్చుతూనే వున్నారు. నవంబరు మూడవ వారాంతమున ఒకానొక విద్యాశాల పాతవిద్యార్థిసంఘంలో మాట్లాడుతూ శ్రీ సత్యమూర్తి కాంగ్రెస్ సభ్యుడుగా తనకు కాంగ్రెస్ మంత్రులు రాజీనామా ఈయడం మనస్కరించలేదన్నాడు. మంత్రిగా బహువారాలు అనుభవంగల డాక్టర్ సుబ్బరాయన్ కాంగ్రెస్ మంత్రుల నిష్క్రమణాన్ని గురించి చింతించవలసింది లేదన్నాడు. శ్రీ సామి వెంకటాచలంచెట్టి కాంగ్రెస్ మంత్రుల రాజీనామాకు ప్రజలు హర్షించడం లేదన్నాడు. వైస్రాయి సూచించిన కేంద్ర కార్యనిర్వాహకవర్గపు విస్తృతిని అంగీకరించుటద్వారా వివిధరాష్ట్రాల్లో కాంగ్రెస్ మంత్రివర్గం తిరిగిరావడం కోరతగిందని శ్రీ రామదాసుపంతులు అన్నాడు. ఇట్లు మదరాసుకోస్తా నాయకులు కాంగ్రెస్ మంత్రుల రాజీనామాల విషయమై ఇట్లు తలఒకమాట ఇప్పటికికూడా చెబుతూవుండడం సముచితంగా లేదు. ఇక కాంగ్రెస్ మంత్రుల రాజీనామాల విషయమై ప్రస్తావించడం మానివేసి అనంతర కర్తవ్యాన్ని గురించి ఆలోచించడం మంచిది.

### ౨. యాంటిహిందీ ఆందోళన : సత్యాగ్రహుల విడుదల :—

కాంగ్రెస్ మంత్రివర్గం రాజీనామా ఇచ్చినపిమ్మట ఏర్పడిన గవర్నరు సలహాదారులు యాంటి హిందీ సత్యాగ్రహుల్ని విడుదలచేశారు. హిందీ వ్యతిరేకవాదులకు ఇంతతో తృప్తికలుగలేదు. హిందీ నిర్బంధ విధానానికి స్వస్తి చెప్పకపోయినట్లయితే తిరిగి తాము సత్యాగ్రహం ప్రారంభిస్తామని వారు అంటున్నారు. హరిజననాయకుడు శ్రీ యం. సి. రాజా హిందీనిర్బంధవిధానం విరమింపబడడం సముచితమని ఉపదేశిస్తున్నాడు. శ్రీ రాజగోపాలాచార్యులు కాంగ్రెస్ మంత్రుల విధానానికి ఏమాత్రం తప్పినడిచినా గవర్నరు సలహాదారులు కాంగ్రెస్ మీద యుద్ధం ప్రకటించినట్లే అవుతుందని చెప్పినాడు. ఈ పరిస్థితుల్లో గవ

ర్నరు సలహాదారులు హిందీ నిర్బంధవిధానానికి స్వస్తిచెబుతారనడానికి ఏమాత్రమూ అవకాశము కనిపించడంలేదు.

### •. కాన్‌స్టిట్యుయంట్ ఎజంబ్లీ : రెడ్డిగారి విమర్శ :—

కాన్‌స్టిట్యుయంట్ ఎజంబ్లీవిధానాన్ని గురించి ఆంధ్రవిశ్వవిద్యాలయోపాధ్యక్షులు శ్రీకట్టమంచి రామలింగారెడ్డి ఇటీవల విమర్శనాపూర్వకమైన ఉపన్యాసాలిచ్చెను. మైనారిటీ సమస్యలోని క్లిష్టస్థితినిగురించి అందు ముఖ్యముగా ముస్లిమ్‌లనుగురించి శ్రీరెడ్డి వెలిబుచ్చిన అభిప్రాయాలు శోచనీయాలై వున్నాయి. ముస్లిమ్‌లు అంతర్జాతీయంగా ప్రముఖమైన అంతస్థుగలవారు. వారినిగురించి ఆలోచించినప్పుడల్లా మనం ఈసంగతి మరిచిపోగూడదని రెడ్డి అభిప్రాయం. జిన్నాకు కాన్‌స్టిట్యుయంటు ఎజంబ్లీ ఇష్టమవడంవల్ల అతడు ఏది అక్కరలేదంటున్నాడో అదే ఇష్టమన్నట్లు అవుతూవుందని అతని ఉద్దేశం. కావుననే హిందూ ముస్లిమ్ సఖ్యతకు కాన్‌స్టిట్యుయంటు ఎజంబ్లీ అడ్డంకిగా వుందని అతడు తేల్చి చెప్పినాడు. ఇట్లు అతని అభిప్రాయాలు శ్రీమాన్ యస్. శ్రీనివాస అయ్యంగారి అభిప్రాయాలతో ఏకీభవిస్తూ వున్నాయి. ప్రస్తుత పరిస్థితుల్లో కాన్‌స్టిట్యుయంటు అజెంబ్లీతప్ప మరి ఒకటి శరణ్యం లేదంటూవుండగా శ్రీరెడ్డివంటివారు ఇప్పుడు ఇట్టి ప్రచారానికి పూనుకోవడం విచారింపతగ్గ విషయం.

### •. ప్రత్యేకరాష్ట్రవాంఛల్ని అదిమిపట్టినందువల్ల :—

మదరాసు కోస్తా మాజీ ప్రధానమంత్రి తన చాణక్యప్రజ్ఞను ఉపయోగించి మదరాసు రాష్ట్రీయుల భాషాప్రయుక్తరాష్ట్రవాంఛల్ని అదిమి పట్టుటవల్ల ఇపుడు ఇక్కడి ప్రజాసంఘంలో ఐక్య భారతదేశం నుండి విడిపోదామనే వాంఛ క్రమంగా ప్రబలుతూవుంది. ఆనడుమ శ్రీ పంద్రంగి కేశవరావు ఆంధ్రదేశానికి పార్లమెంటుతో ప్రత్యేకసంబంధంగల స్వాతంత్ర్యం కావాలనే వాదన లేవతీశాడు. తమిళుల తరఫున ఇప్పుడు అదేమాదిరిగా శ్రీ ఇ. వి. రామస్వామి నాయకరు తమిళనాడు మిగిలిన భారతదేశాన్నుండి విడిపోవాలనీ, దానికి ప్రత్యేకంగా పూర్ణస్వరాజ్యం ఈయబడాలనీ అన్నాడు. పైగా అతడు తనతోడి తమిళులు తాము భారతీయులమనే దృష్టితో కాక తాము తమిళులమనే దృష్టితో వ్యవహరించుకోవాలని హెచ్చరించాడు. కాంగ్రెస్ మంత్రివర్గాలు భాషాప్రయుక్తరాష్ట్రవిభజనకు పూనుకోకపోవడంవల్ల కలిగిన నష్టమిది. ఈతప్పును ఇప్పుడైనా గుర్తించి కాంగ్రెస్ దానిని సవరించడానికి పూనుకుంటేతప్ప భారతదేశ ఐక్యానికి భంగకరమైన ఈ ఆందోళన అతిశయించగలదు.

### •. శ్రీ సామి వెంకటాచలంశ్రేష్ఠిగారి దివ్య ప్రచారము :—

మదరాసును ఆంధ్రరాష్ట్రరాజధానినిచేయడం విషయంలో శ్రీ సామి వెంకటాచలంశ్రేష్ఠిగారు చూపుచున్న శ్రద్ధ బహుధాప్రశంసనీయమైవుంది. ఆ సందర్భంలో నిధి వసూలుచేయడానికి వారు ఉత్తర సర్కారులలో సంచారము సాగిస్తున్నారు. వారికి అన్నివిధముల తగు ప్రోత్సాహాన్ని కలిగించడమూ, ఆంధ్రనిధికి ధారాళముగా విరాళాలు ఇవ్వడమూ ఆంధ్రుల విధి.

# తెనుఁగుతల్లి

(శ్రీ శేషాద్రి రమణకవులు)

"శ్రీచళుక్య నృపాలక సింహమైన
రాజ రాజనరేంద్రుగారాబుపట్టి
నన్నయ తపస్వి కడుపారఁ గన్నబిడ్డ
దీనజనకల్పవల్లి మా తెనుఁగుతల్లి"

"మనుమసిద్ధి నృపాల సామ్రాజ్యమందుఁ
దిద్దె నల్లారు ముద్దుగాఁ దిక్కయజ్వ
కడుపసితనాననే రాచకర్జములను
తెలివితేటలఁ బడిసె మా తెనుఁగుతల్లి"

"ఒజ్జయై రెడ్డిఱేండ్ల యొడ్డోలగమున
శంభుదాసుండు చదివించె జాను తెన్గు
నడల చక్కఁదనంబొప్ప నడుగువిడుచుఁ
దెలివితేటలఁజూపె మా తెనుగుతల్లి"

"పేర్మి కవిసార్వభౌముండు ప్రేమఁజూపి
బంగరుపు టందలంబుల పైనిఁజేర్చి
రాజ భోగంబులను గూర్ప రాజసమునఁ
దేజు చెలువారమించె మా తెనుఁగుతల్లి"

"భక్తియోగంబు పోతన పండితుండు
పాట బాడుటలో నేర్పు భట్టుమూర్తి
మిన్నయగు కల్పనంబు సూరన్న నేర్ప
దేశభాషలఁ బేరొందెఁ దెనుఁగుతల్లి"

"పదములను దీరిచె శిరీషమృదులములుగఁ
బేర్మి పెద్దన్న, చిన్నన్న ద్విపదశోభఁ
గన్నులకు నద్దుకొనునట్లు గాఁగఁదీర్చె
అనుఁగుఁ జెల్లెంద్రమించె మా తెనుఁగుతల్లి"

"కృష్ణరాయప్రభుం డాదరించి రాణి
వాసమునఁజేర్చి యన్యభాషానుశీల
లూడిగం బొనరింపఁగాఁ గూడి యుండె
దేశసౌభాగ్య మరయుచుఁ దెనుఁగుతల్లి"

"గోలకొండ నవాబులు గూడఁదనదు
రాజసముజూచి మాతృ గౌరవము నెఱప
రాచపొలఁత చెంతఁ బురాణకథలఁ
దేటపఱచెను దొల్లి మా తెనుఁగుతల్లి"

"నాజనని రమ్మనుచు రఘునాథరాజు
చేర్చె తంజాపురంబునఁ జేమకూర
అమృతపాత్రంబులోపల నారగించి
తృప్తిమై సంతసించె మా తెనుఁగుతల్లి"

"తొలఁగె రాజావలంబనంబులు, స్వతంత్ర
కలనమడఁగెఁ బ్రబంధదుష్కరములైన
శృంఖలలఁ గొన్నినాళ్లు ధరించి ప్రాఁత
తెరువులంబట్టి తిరిగె మా తెనుఁగుతల్లి"

"త్యాగరాయలు రామనామామృతంబు
గేయపాత్రల నుంప నా కృతివిలాస
మలరఁ గైకొని ద్రవిడ గాయకులదనిపి
తీరెమన్నన లంది మా తెనుఁగుతల్లి"

"రుచిరమణి పీఠమున నుంచె రుద్రదేవి
మోహనాంగియు వెంకమ ముద్దుపళని
అచ్చమాంబిక వరలక్ష్మియాంధ్ర తత్త్వ
దీపికలు దాల్పఁదనరె మా తెనుఁగుతల్లి"

"ఈత్రిలింగము వీరేశ లింగభవము
సరస తిరుపతి వేంకటేశ్వరుల గిరుల
రాజిలుట చేసిగద శివరామశక్తి
దీపితంబనమించె మా తెనుఁగుతల్లి"

"తొల్లి విజ్ఞానచంద్రిక వెల్లివిరియఁ
దనరె విజ్ఞానసర్వస్వమును గడించి
భారతీ గృహలక్ష్ముల పరమమైత్రి
నెరసి యిపుడొప్పు చున్నది తెనుఁగుతల్లి"

"మూఁడు కోటుల యాంధ్రుల ముద్దుదీర్ప
తెనుఁగు తల్లిరో ! సత్యవతీ హితముగఁ
దెనుఁగు బాసను సాత్యవతేయబృంద
మెలమి మైగూర్పవమ్మ మా తెనుఁగుతల్లి"

# నా ఫిలిం అనుభవములు

[ఈ వ్యాసకర్త ఆంధ్రనాటకలోకమున చిరవిఖ్యాతులు. ఈయన ఇటీవల ఫిలుముపరిశ్రమలో ప్రవేశించారు. అందలి ఈయన అనుభవాలు ఆంధ్రలోకము తెలుసుకొనతగినవిగా వున్నాయి. నేటి సినీమాడైరక్టరులలో కొందరి అనుభవాలు ఇందుతో సాదృశ్యాన్ని పొందగలవు. ఈ అనుభవాలని తెలుసుకొనుటవలన అనుషక్తిగా నేను తెనుగు ఫిలుముపరిశ్రమయొక్క లోటుపాట్లు కొంతవరకు అవగత మాతాయి—సంపాదకుడు.]

రచయిత:

## కృత్తివెంటి నాగేశ్వరరావు

మా సమాజము చెన్నపురియందు కాలేజిగరల్ నాటకములు ప్రదర్శించినతరువాత అచ్చటి మిత్రులు ఆకథనే ఫిలిం తీయవలశినదిగా ప్రోత్సహించారు. ఆ ప్రోత్సహించినవారిలో మాకుబంధుకోటిలో చేరిన ఒక అడ్వకేటుగారు లిమిటెడ్డు కంపెనీక్రింద పెట్టి తీయించిన వొకరిమీద బరువువుండదు, సులువుగా పనిజరుగుతుందని సలహాయిచ్చారు. ఆసలహా నాకూ నచ్చినందున అంగీకరించాను. అప్పట్లో రాజమంద్రివెళ్ళి తిరుగ కొన్నాళ్ళకువచ్చి అందుకు కావలశిన ఆర్టికల్సు మిమోరండం అన్నీ వ్రాయించియిమ్మన్నాను. వారు వ్రాయించి యిప్పించారు. అచ్చువేయించాను. విశాఖపట్టణం, కాకినాడ, రాజమంద్రి, ఏలూరు, చెన్నపట్టణమున, కొంతమంది మిత్రులగు పెద్దలచే డైరక్టరులుగా వుండుటకు షేర్ల సంతకాలు పూర్తిచేయించాను. అంతలో వో విడ్డూరం తటస్థించింది.

కాలేజిగరల్ నాటకమును ఆదిని శ్రీ కాళ్ళకూరి హనుమంతరావుగారిచే వ్రాయించాను. అది ప్రదర్శించిన ప్రతి పట్టణమున రంగమునకు అనుగుణ్యముగా నుండునటుల ఎన్నివిధముల మేము మార్చి ప్రదర్శించినా పాత్రపోషణ సరిగ్గాలేదని యిత్యాది క్రిటిసిజమ్సు చాలాబయలుదేరాయి. 1934 సంవత్సరముననే మదరాసు నాటకములు పూర్తిఅవగానే మనం చేశిననేరమును మనమే సవరించుకోవాలనే వుద్దేశమున ఆకథ, ప్లాటు అంతా నేనే సృష్టించియిచ్చి వ్రాయించాను. ఆదోసములన్నీ సవరింపించి వ్రాయింపించి అచ్చువేయించాలనుకున్నాను. మొదట వ్రాయింపించిన హనుమంతరావుగారిచే వ్రాయించుటకు ఆనాటకమాడుతున్నంతకాలము వారు పెట్టిన పేచీలకు విసిగి వేసారియుండుటవల్ల వారితో ఎట్టి సంబంధము వుంచుకోవడం యిష్టములేక, యింకొక సర్వసమర్థులగు సత్కవివరేణ్యునిచే వ్రాయించి అచ్చువేయించాను. తనకాలేజీగరల్‌ను యిన్ఫ్రింజుచేశానని హనుమంతరావుగారు చార్జీయిచ్చారు. కథ, ప్లాటు అన్నీ నేను కల్పించి యిచ్చి వ్రాయించాను. కాన పుస్తకముమీద హక్కు వారికున్నప్పటికీ కథ నాదిగాన దాన్ని యింప్రూవు చేసి వ్రాయించినానని నావాదన. ఈ చార్జీమయాన యీఫిలింకంపెనీ ప్రయత్నము చేయడం మంచిదికాదని తలంచి అప్పట్లో ఆప్రయత్నం విరమించాను.

అంతట చెన్నపురియందు పీపుల్సు బ్యాంకి మేనేజింగు డైరక్టరు, వైసుఛేరుమన్లు, శ్రీరాంబాబు, బలరామమూర్తిగార్లు ఫిలింతీయించు ప్రయత్నమున రాజారావునాయుడుగారిని డైరెక్టరుగా నియమించి విజయ సినీటోన్ అని కంపెనీపెట్టి దానితరఫున రాజారావునాయుడుగారిని, రికార్డింగు ట్రక్కు కెమెరా వగైరాసామానులను, టెక్నిషియన్లను తీసుకుని వచ్చుటకుగాను బొంబాయికి పంపించారు. వారు బొంబాయివెళ్ళేటాకి అనేది క్రొత్తగా బొంబాయికివచ్చిన రోజుల్లో దిగుమతిఅయినబాపతు సౌండు ట్రక్కు కెమెరా సామాన్లు టెక్నిషియన్లను కంట్రాక్టుపద్ధతిని తీసుకునివచ్చారు.

కీల్పాకులో బంగాళాలు పుచ్చుకున్నారు. లాబరేటరీ వగైరా బిగింపులుపనులు ప్రారంభించారు. సేతుబంధనం బొమ్మ తీయించడానికి నిశ్చయించుకొని రాజారావునాయుడుగార్ని ఆర్టిస్టులను బుక్కుచేయుటకు పంపించారు. ట్రస్టీలు ఆసమయముననే కాలేజిగరల్ నాటకమును వీరందరూ లోగడ చూచియున్నారేమో ఆకథనే సోషల్ చిత్ర

[మిగతా ౨౧౪-వ పేజీలో.

ధిక హర్ష విస్మయమగ్నులైరి. అతనిని కౌగలించుకొనిరి. ఆశీర్వదించిరి. ఇట్టి వారి సంభ్రమచేష్టలు కని విస్మితుడగుచు అతడు మ్రొక్కి 'తండ్రీ! ఇదియేమి?' అని అడిగెను. అప్పుడు శత్రుజితుడు కొడుకునకు అంత వృత్తాంతమును తేటపడునట్లు తెలియచెప్పెను. మదాలస మరణవార్త అతని చెవులకు శూలమైనది; అతని హృదయమునకు చిచ్చుతాకినట్లయి సహింపరాని వేదనకల్గినది. చేష్టలుతక్కి వెఱగుపాటునొంది విషణ్ణమూర్తియై శోకలజ్జలకు తావలమైన వదనముద్రాల్చి అతడు తల్లిదండ్రుల వద్ద నిలిచెను. నిట్టూర్పులు నిగిడించుచు కొందలమందిన హృదయముతో ఆరాజకుమారుడు తన మనమున ఇట్లు తలపోసెను. "మదాలస నామరణవార్త వినుచునే ప్రాణములు పాసినది. ఆమెమరణ వృత్తాంతమును వినియును నేను జీవముతో ఉన్నాను. నావంటి కఠినచిత్తుడు కలడా! మదాలసను పేర్కొని ఎలుగెత్తి ఏడ్చెద మనుకొంటినా ఇది మావంటివారికి మానహాని. పోనీ ఈశరీరమును జీవములును మదాలసకు ఇచ్చెద మనుకొంటినా శరీరప్రాణములు తండ్రిసొమ్ము. పోనీ మునివృత్తిని అరణ్యమునకు పోయెదననుకొంటినా తండ్రిగారు నన్ను పోనీయరు. పోనీ ఉడిగిమడిగి ఉందు ననుకొంటినా అది నొవ్వనివారికి నవ్వసను. నాకొఱకు ప్రాణములర్పించిన మదాలసకు తగిన ప్రత్యుపకృతి నేనేమి చేయగలను? వేయి చింత లేల? తిరిగి నేను వివాహము చేసికొనక భోగసౌఖ్యములు పరిహరించెదను."

ఇట్లు తలపోసి కువలయాశ్వుడు మదాలసకు తిలోదకప్రదానమును, అనంతరక్రియాకలాపమును నెఱవేర్చెను. పిమ్మట ఎల్ల వారును వినునట్లుగా రాజకుమారుడు ఇట్లు ప్రతిజ్ఞ పట్టెను. 'నాకు ఈజన్మమున సుగణసుందరి మదాలస యొక్కతియె భార్య. నేను తిరుగ వివాహముచేసికొనను. ఇది సత్యము.'

ఈవిధమున ప్రతిజ్ఞ చేసి కువలయాశ్వుడు సంసారసుఖములు అన్నియు వదలినాడు. ఈడుజోడుగల స్నేహితులతో ప్రొద్దుపుచ్చుచుండును. మదాలసను తెచ్చియిచ్చుటయే అతనికి చేయగల పరమ కార్యము. అది ఈశ్వరునికే చేయరానిది అయిఉండగా ఇతరులకు శక్యముకాదని వేఱే చెప్పవలసిన పనిలేదు.

## ౧౪

నాగకుమారులు చెప్పిన వృత్తాంతము అంతయువిని అశ్వతరుడు నవ్వుచు ఇట్లుపలికెను. జనులు ముందుగానే కార్యము అశక్యమని మనసులో భావించెదరు. కావున దానినిగురించి పూని పని చేయరు. ప్రయత్నింపకుండగనే కార్యము ఫలించునో ఫలింపదో ఎట్లు చెప్పనగును? తన పౌరుషమును వదలక మనుజుడు కార్యము ఒనర్పవలయును. అప్పుడు పురుష ప్రయత్నమునకు దైవము తోడగును. పిమ్మట కార్యసిద్ధి అగుట నిశ్చయము. కావున నేను ఈవిధమున ప్రయత్నముచేసెదను.'

## ౧౫

అనంతరము అశ్వతరుడు హిమాలయపర్వతమున ఉన్న ప్లక్షావతరణమను తీర్థమునకు పోయెను. సకలవాఙ్మయస్వరూపమైన సరస్వతిని తన హృదయపద్మమున నిలిపి అతడు ఆతీర్థమున చిరకాలము తపముచేసెను. అతని తపమునకు మెచ్చి సరస్వతి ప్రత్యక్షమై ఇట్లు పలికినది: 'వత్సా! నీతపమునకు మెచ్చితిని. మున్ను పరలోకప్రాప్తుడైన నీతమ్ముడు కంబళుడు తిరిగివచ్చి మునుపటివలెనే నీకు సహాయుడగునట్లు వరమిచ్చితిని. ఇక నీకు కోరదగినది ఏది? అడుగుము.' అనగా అతడు 'దేవీ! కంబళునకును, నాకును సంగీతవిద్యావిశారదత్వము ప్రసాదింపవలయును-' అని కోరెను- అంతట వాగ్దేవి బిడ్డా అట్లేఇచ్చితిని. నాదయ మీకుకలదు- మీతో సమానముగా సంగీతముపాడగలవారు స్వర్గలోకమునగాని, భూలోకమున గాని, పాతాళలోకమునగాని ఉండరు.' అని చెప్పి అంతర్ధానము చేసెను.

అప్పుడు పదతాళస్వరాదిలక్ష్య

లక్షణమంతయు ఆ అన్నదమ్ములకు సరస్వతి మహిమవలన అవగతమైనది. సంతోషమున మునిగి తేలుచు కంబళుడును అశ్వతరుడును కైలాసపర్వతముమీదికి వెళ్ళినారు. అచ్చట శివునిగూర్చి చిరకాలము తమగానశక్తి అంతయు ధారపోసి పాటలుపాడినారు- అందుకు మెచ్చి శివుడు వారికి దర్శనమిచ్చి 'బిడ్డలారా! మీకోరిక ఏమి? తీర్చెదను. చెప్పుడు' అనెను. శివునకు మ్రొక్కి వారు 'మహాదేవా! మరణించిన మదాలసను తిరిగి మాకు ప్రసాదింపవలయును' అని అడిగిరి. 'అట్లే ఇచ్చితిని' అని శివుడు మాయమయ్యెను.

౧౬

అట్లు మదాలసను పొంది ఎవ్వరు ఎఱుగకుండ వారు ఆమెను అంతఃపురమున దాచిరి. అశ్వతరుని ఆజ్ఞచొప్పున స్త్రీలు అచ్చట మదాలసను కాపాడుచుండిరి. ఇట్లుండగా ఒకనాడు అశ్వతరుడు కుమారులతో 'బిడ్డలారా! రాజకుమారునకు ఉపకారము చేయవలయునంటిరి. చేసినారా? ఆగుణవంతుని ఒకనాడైనా నాదగ్గిరకు తీసికొనిరారేమి?' అనెను. అందుమీద నాగకుమారులు ఒకనాడు ఆటపాటల పొద్దుపుచ్చి కువలయాశ్వునితో 'చెలికాడా! నీవు మాయింటికి ఒకసారి రావలయును' అనిరి. అనగా రాజకుమారుడు 'మన స్నేహధర్మములో మాయిల్లు మీయిల్లు అని భేదముచేయుట మీకు బాగున్నదా?' అని అడిగెను. దానికి నాగకుమారులు 'స్నేహితుడా! మాకట్టి భేదభావము ఎప్పుడును లేదు. ఒకసారి నిన్ను చూడవలయునని మానాయనగారు ముచ్చటపడుచున్నారు. కావున నిన్ను ఇట్లు కోరితిమి.' అని బదులుచెప్పిరి. అదివిని రాజకుమారుడు వెంటనే లేచి 'అట్లైన నేను ధన్యుడను. పోవుదములెండు మీతండ్రియే మాతండ్రి. మీవలెనే నేనును అతనికి ప్రియముచేయవలయును. తండ్రిపిలుచునప్పుడు తడయరాదు. కావున చురుకుగా పోదము. రండు' అనెను. వెంటనే ఆ మువ్వురును కాలినడకను పురము వెడలిపోయి గోమతి అను నదిని దాటుచుండిరి. అప్పుడు రాజకుమారుడు మీపూరు ఈనది ఆవలి దిక్కున ఉన్నదా అని అడిగెను. అందుమీద వారు అతని రెండు చేతులును పట్టుకొని నాగకుమారవేషములుపొంది, భూగృహము ద్వారా ఋతధ్వజుని పాతాళలోకమునకు కొనిపోయిరి. పోవుచు వారు 'చెలికాడా! మేము నాగలోకనివాసులము మాతండ్రి అశ్వతరుడు. అతడు నాగరాజు.' అని కువలయాశ్వునితో చెప్పిరి.

౧౭

పాతాళలోకమున ప్రతిగృహమున చెలఁగుచున్న వీణాగీతములు, వేణుగానములు, మద్దెలమ్రోతలు వినుచు వారు నాగరాజమందిరమునకు పోయిరి. అచ్చట కువలయాశ్వుడు అశ్వతరుని చూచెను. అతడు నిండుకొలువు తీర్చిఉండెను; దివ్యాంబరములు కట్టుకొనియుండెను; దివ్యభూషణములు పెట్టుకొని యుండెను; నాగకన్యలు చామరములు వీచుచుండగా వజ్రములు వైడూర్యములు చెక్కిన బంగారుసింహాసనముమీద ఆసీనుడై ఉండెను- అట్లు కొలువున్న నాగరాజుపాదములకు రాజకుమారుడు మ్రొక్కెను. వెంటనే అశ్వతరుడు కువలయాశ్వుని కౌగిలించుకొని తల నిమిరి దీవించి కూర్చుండ నియమించి ఇట్లు పలికెను. 'ఓపుణ్యాత్ముడా! నీసుగుణములకు నేను ఎల్లప్పుడును సంతోషించుచుందును. మంచి గుణములు కలవాని జీవితము ఎల్లవారిచేతను పొగడబడును. గుణములు లేనివాడు బ్రతికియు చచ్చినవాడే. పుత్రుడైనవాడు తల్లిదండ్రులకుఆనందమును, శత్రువులకు హృదయజ్వరమును కలిగించుచు బ్రతుకవలయును. అప్పుడే అతడు జన్మము ఎత్తినందులకు ఫలము కలుగును.

౧౮

కువలయాశ్వకుమారుడు అశ్వతరుడు చెప్పిన మాటలకు ప్రియమందెను. పిమ్మట నాగకుమారులతో కలసి అభ్యంగన మాచరించెను. విందులుకుడిచెను. ఇట్లు నిత్యనియతకృత్యములుసల్పి అభీష్ట

కథాప్రసంగము చేయుచుండెను. అప్పుడు నాగరాజు కువలయాశ్వునితో ఇట్లనెను. 'రాజకుమారా! నీవు మాయింటికి అభ్యాగతుడవు. కావున నిన్ను మేము గౌరవించి పూజింపవలసియున్నది. కొడుకు తండ్రిని ఎట్టిసందేహములేక కోరునట్లు నీవు నన్ను నీకభిమతమైన ధనమును అడుగుము.' అనగా రాజకుమారు డిట్లు చెప్పినాడు 'దేవా! మాయింటియందు సువర్ణాదివస్తువులు సమస్తమును కలవు. సకల భూవల్లభుడగు మాతండ్రిగల పదివేలేండ్లకును నాకేమిటను కొఱంత లేదు. పాతాళాధిపతివైన నీదయ పొందితిని. అట్టినేను ఇంక కోరదగినదేమున్నది. తండ్రిచేతులను చల్లని చెట్టునీడలందు వసించియుండు పుత్రులు భూమిమీద చాల సుఖవంతులు. చిన్నతనముననే తండ్రినికోల్పోయి కుటుంబభారమును వహించి తీవ్రదుఃఖవేదన పడువారు మిక్కిలి దురదృష్టవంతులు. మహారాజగు మాతండ్రి దయవలన నాకు ధనమునకు ఏమియు కొఱతలేదు. పుష్కలముగ అనుభవించుటకు, అర్థులకు తనివితీర ఇచ్చుటకును వలసినంతధనమున్నది. యౌవనమును, ఆరోగ్యమును పొందియున్నాడను. ఇక నేను కోరదగినవి ఏమిగలవు?' అందుకు అశ్వతరు డిట్లు బదులుచెప్పెను. 'రాజకుమారా! మణికనకాదులు కోరవేని మనమునకు ప్రియమైనది మఱియొకటి అడుగుము. ప్రీతితో ఇచ్చెదను–' అందుమీద రాజకుమారు డిట్లు వచించినాడు. 'దేవా! నిన్నుచూచి నేను కృతార్థుడనైతిని. నీశరీరమున పొంది నాతనువు పవిత్రమైనది. మీపాదరజము నాశిరోభూషణమైనది. ఇట్లు సర్వమునెఱవేఱినవి. అయినను ఏదేని ఇచ్చెదనంటివేని ఎల్లప్పుడును ధర్మమునందు స్థిరబుద్ధియుండునట్లు అనుగ్రహింపుము. రత్నములు, కాంచనములు, గృహములు, వస్తువులు, వాహనములు మున్నగు సమస్తసంపదలును ధర్మము ఫలములే. కావున నాకు ధర్మతత్పరత దయచేయకోరెదను.' దానికి అశ్వతరు డిట్లు మారుపలికెను. 'నీవు కోరినట్లు నీహృదయము అనుదినమును అధికధర్మాన్వితమై యుండును–సరే, దీనికేమి? భూమిమీద పడయరాని వస్తువు ఏదైన ఒకటి ఎట్లైన నావలన నీవు పొందితీరవలయును.'

౧౯

అప్పుడు కువలయాశ్వకుమారుడు నాగకుమారుల మొగములు చూచెను– అతని అభిప్రాయము తెలిసికొని నాగకుమారులు తండ్రిపాదములకు ప్రణమిల్లి 'తండ్రీ! నీవు ఇతనికి అభిమతమైన వస్తువు ప్రసాదించెదవేని చెప్పెదము విను

ము. ఇతనిభార్య మదాలస రాక్షసమాయవలన ఇతనికొఱకు ప్రాణములు త్యజించినది. అప్పటినుంచియు ఇతఁడు మదాలసను తలచుకొనుచు అన్యభార్యాపరిగ్రహణముచేయనొల్లక ఉన్నాడు. ఎల్లవారికి ఉల్లాసము కలుగునట్లు చనిపోయిన మదాలసను ఆతనికి అనుగ్రహింపుము' అనిపలికిరి. అప్పుడు అశ్వతరుడు కువలయాశ్వునిచూచి 'చచ్చినవారిని కలలోనైనను చూడవచ్చును. కాదేని మాయాచిత్రముచేసి చూపింపవచ్చును. అంతే కాని తిరిగి వారిని తీసికొనిరాలేము?'

ప్రియకాంతను చూడవలెనను వేడ్క ధైర్యమును చిటిలింపగా, హృదయమున పేరుకొనియున్న ప్రేమ సిగ్గును ఉత్తరింగా ఋతధ్వజుడు వినయవినమ్రుడై చేతులు మోడ్చి మ్రొక్కి అశ్వతరునితో 'నాగరాజా! దయకలదేని మాయాచిత్రముననైన మదాలసను ఒకసారి చూపింపుము-' అనెను. అనగా 'మాయరూపు చూడ మనసుకలదేని కనుగొనుము' అని అశ్వతరుడు మాయమంత్రములు చదువువానివలె నటించుచు నాగకన్యలచే మదాలస నచటకు రప్పించెను. అట్లు రప్పించి 'కుమారా! ఈమాయామదిరాక్షి నీ మదాలసయేనా?' అనెను. విస్మయము గొల్పుచున్న మదాలస లావణ్యావిలసనముచూచి కువలయాశ్వుడు సిగ్గువిడిచి 'సుందరీ! నన్నువిడిచి ఎక్కడికి పోయెదవు' అనుచు ఆమెను చేరబోయెను- అప్పుడు అశ్వతరుడు ఆతనిని వారించి 'కుమారా! ఇది మాయారూపము. ముట్టినచో మాయమగును.' కావున దీనిని అంటవలదు. అని అనెను. అంతట రాజకుమారుడు మోహవివశుడై మూర్ఛనొందెను. అశ్వతరుడు అతనిని మూర్ఛదేర్చి ఊరడించి తాను మదాలసను పొందిన వృత్తాంతమంతయు వానికి వినిపించెను.

## ౨౦

కువలయాశ్వుఁడు విస్మయహర్షముగ్ధుఁడై అశ్వతరునికి అభివందనముచేసెను-కొంతకాల మచ్చట మదాలసతోఁగూడనుండి పిమ్మట కువలయాశ్వుడు తన పట్టణమునకు బయనమయ్యెను. తలచినమాత్రమున కువలయాశ్వముచచ్చి పాతాళలోకమున వ్రాలెను- అశ్వతరుని నాగకుమారులను వీడ్కొసి కువలయాశ్వుడు మదాలసతో గుఱ్ఱము నెక్కి ఇంటికివచ్చెను. వచ్చి తండ్రి చరణములకు ప్రణమిల్లి మదాలసా పునరుద్భవప్రకారమంతయు వినిపించి తల్లి మొదలగువారికి సంతోషము కల్గించెను. మదాలసయు అత్తమామలకు మ్రొక్కి బంధువులను సంభావించెను.

పూర్వమువలె కువలయాశ్వుడును మదాలసయు అభిమతభోగము లనుభవించుచు సుఖముండిరి.

'కుమారా! ఈమాయామదిరాక్షి నీమదాలసయేనా?' అనెను.

# మరణించి బ్రతికిన మదాలస

"మగనిమరణవార్త వినుచునే ప్రాణములు విడిచి పరలోకవాసియగు భర్తను కూడబోయిన ఈ సువ్రత విచిత్రచరిత్రము దుఃఖింపతగినదా ?"

## ౧

ఎవ్వఁడొనరించిన యజ్ఞములందు సోమపానముచేసి ఇంద్రుఁడు సంతోషభరితుఁడయ్యెనో అట్టి శత్రుజిత్తు మహారాజునకు ఋతధ్వజుఁడను పేరుగల కుమారుఁడు కలఁడు. ఆ కుమారుఁడు మంచి గుణములుకలవాడు ; అందమున అశ్వనీదేవత లంతటివాడు ; బుద్ధికి బృహస్పతి; భుజబలమున ఇంద్రునితో సమానుడు ; విశేషించి పుణ్యశీలుడు.

తనకు ఈడుజోడుగల రాచకుమారులతోకూడి ఋతధ్వజుడు ఆడుచు పాడుచు ఆనందముతో కాలము గడుపుచుండెను. స్నేహపాత్రుడని ఎంచి అనేకులు విప్రరాజవైశ్యకుమారులువచ్చి ఋతధ్వజునితో నేస్తముకట్టుచుండిరి. అట్లు నేస్తముకట్టినవారిలో నాగలోకనివాసులు ఇరువురు నాగకుమారులుకూడ నుండిరి. వారు మంచి రూపవంతులు, నవయౌవనులు. పొగడతగిన సుగుణములు కలవారు. రాజకుమారునితో విహరింప మనసుపుట్టి ఆనాగకుమారులు బ్రాహ్మణకుమారుల వేషములు తాల్చివచ్చిరి. వారిని గౌరవించి ఋతధ్వజుడుస్నేహితులనుగా స్వీకరించెను. ప్రియములరారునట్లుగ వారు దినదినము వివిధవిహారములు సల్పుచుండిరి. వెలగల బట్టలుకట్టుకొనుచు, మంచిమంచి నగలు ధరించుచు, చందన మలదుకొనుచు, విందులుచేయుచు విహరించుచుండిరి. ఇట్టి లలితభోగములేకాక వారు విద్యావినోదములు కూడ జరుపుచుండిరి. ఉదీర్ణరసాన్వితములగు గీతముల పాడుచు, కావ్యములు చదువుచు, నాటకములు ఆడుచు చెలగుచుండిరి. ఇట్టి విద్యావినోదములేగాక వారు పరిశ్రమనైపుణములుకూడ ఉపచరించుచుండిరి. గజాశ్వశిక్షల నేర్చుకొనుచు, అస్త్రములు, శస్త్రములు ప్రయోగించుట అలవడచేసికొనుచు విలసిల్లుచుండిరి. ఇట్లు లలితభోగములతో, విద్యావినోదములతో, పరిశ్రమనైపుణములతో పరిహాసవచనరచనలతో, సరసకళాభ్యసనములతో, తనివితీరని వేడ్కలతో ఋతధ్వజుడును, నాగకుమారులును స్నేహము నెఱపుకొనుచుండిరి. ఇట్లు నాగకుమారులు ప్రతిదినము పగలు బ్రాహ్మణవేషములతో రాజకుమారునితోగూడి ప్రొద్దులుపుచ్చుచు, వినోదించుచు రాత్రిపూట నాగలోకమునకు పోవుచుండిరి.

## ౨

చాలరోజు లిట్లు జరిగిపోయెను. ఒకనాడు నాగకుమారులను వారి తండ్రి అశ్వతరుడు 'కుమారులారా! చాలరోజులనుండి పగలు మీరీ మన నాగలోకమున కనిపించుట లేదు. నరలోకమునకు పోవుచున్నట్లున్నది. ఎవ్వనితో ఆడుకొనుటకు మీరచ్చటికి పోవుచున్నారు?' అని అడిగెను. అప్పుడు నాగకుమారులు చేతులుమోడ్చి మ్రొక్కి వినయముతో తండ్రికిట్లనిరి. 'అయ్యా! భూలోకమున శత్రుజితుడను మహారాజు ఉన్నాడు. ఆరాజు కుమారుడు ఋతధ్వజుడను పేరుగలవాడు. అతడు చాల అందమైనవాడు ; మంచి నడతకలవాడు ; శౌర్యమే ఆభరణముగా కలవాడు. ప్రియంవదుడు. విద్యావిదుడు. బుద్ధిమంతుడు. విశేషించి వినయనిధి. లజ్జాభిమానములు కలవాడు. ఇంత

కును మంచి స్నేహపాత్రుడు. అట్టి వానితో చెలిమికలిగి మెలగుచుందుము. అతడు చేయు వివిధోపచారములవలన మాకెంతో సంతోషముగ నుండును. ఈలోకమునందు కాని, మఱి యేలోకమునందు కాని మాకంతటి ప్రీతి పుట్టదు.''

ఆమాటలకు అశ్వతరుడు సంతోషించి ఇట్లు పలికెను: 'కుమారులారా! సుగుణసంపత్తికలిగి ఎవ్వనిపుత్రుడు ఎల్లప్పుడును సత్పురుషులచే పరోక్షమున ఇట్లుపొగడబడునో అట్టి తండ్రి ధన్యతముడు. స్నేహితులును శత్రువులును ఎవ్వని చెలికారమును సామర్థ్యమును ఎల్లవేళల కీర్తింతురో అట్టి పుత్రునిచేతనే తండ్రియగువాడు పుత్రవంతుడగును. అది అట్లుంచుడు. ఉపకారపరుడును, స్నేహపాత్రుడును, సుగుణసుందరుడును అయిన ఆరాజకుమారునకు మీరెప్పుడైన ప్రీతితో ప్రత్యుపకారముచేసినారా? మనయింటియందున్న బంగారువస్తువులను, రత్నములను, వాహనములను తీసికొనివెళ్ళి ఆరాజకుమారునకిచ్చి సంతోషపెట్టుడు. ఉపకారపరుడైన మిత్రునకు ప్రియముచేయనివాని జీవితము కుచ్ఛితమైపోవును. కావున స్నేహితుడైన రాజకుమారునకు మీరేదైన మంచి ఉపకృతి చేయుడు.'

అనిన తండ్రిమాటలకు నాగకుమారు లిట్లు బదులుచెప్పిరి: తండ్రీ! ఋతధ్వజుడు సమస్తమైన ఐశ్వర్యములుకలవాడు. వస్తువాహనములిచ్చి ఆతనికి ప్రియము చేయుటకు ఇంద్రునకే శక్యము కాదు. ఋతధ్వజునకు ఉన్నట్టి రత్నములు, వస్తువులు, వాహనములు మన నాగలోకమందు లేనే లేవు. ఋతధ్వజునివిజ్ఞానము కొలది ఇడరానిది. కొమ్ములు తిరిగిపోయిన పండితుల సంశయముల నన్నిటిని నిమిషములో నివారింపగల సత్త్వశాలిఅతడు. ధనమునందును, జ్ఞానమునందును అతనికి అపేక్షింపదగినది ఏమియునులేదు. కాని అతనికి కావలసినకార్య మొక్కటిమాత్రమున్నది. అది లోకరక్షకులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు తప్ప మిగిలినవారికి అసాధ్యము.'

అనగా నాగకుమారులతో తండ్రి ఇట్లుచెప్పెను: 'ఇది సాధ్యము, ఇది అసాధ్యము అని ఎన్నుటతో పనిలేదు. బుద్ధినుపయోగించు నిశ్చలారంభకుల కెట్టికార్యమైనను సిద్ధించును. తగినవిధమున ప్రయత్నించి మనుష్యు లమరత్వమేగాక అమరేశత్వమును, అమరేశత్వమేగాక అమరపూజ్యత్వమునుగూడ పొందుదురు. కదలక మెదలక కూర్చుండినయెడల గరుత్మంతుడైనను ఒక్క అడుగు పోలేడు. పూని నడచుటకు మొదలుపెట్టినయెడల చీమయైనను సహస్రయోజనము లరుగగలదు. కార్యసిద్ధికి కావలసినది పూనిక. చూడుడు. ఎక్కడభూమి? ఎక్కడి ఆకాశము ? భువినుండిన ధ్రువుడు పూనికచేతకదా దివిమీద ధ్రువమగు పదము పడసినాడు? పూని పనిచేయువానికి పడయరాని కార్యములేదు. కావున ఋతధ్వజునకు చేయవలసిన కార్యమేది? నాకెఱిగింపుడు.'

అందుమీద అశ్వతరునితో నాగకుమారు లిట్లుపలికిరి: 'తండ్రీ ! ఋతధ్వజుడు తన వృత్తాంతమంతయు మాతో ఒకసారి చెప్పినాడు. మేమాతనివలన విన్నదంతయు నీకు విన్నపము చేయుదుము. దయచేసి వినవలయును.

3

గాలవుడను ఒకముని. అతడొకసారి శత్రుజితు దగ్గఱకు వచ్చెను వచ్చునపు డాత డొక గుఱ్ఱమును తోడ్కొనివచ్చెను. అట్లువచ్చి గాలవుడు శత్రుజితుతో ఇట్లుచెప్పెను. 'రాజా! మౌనవ్రతముపూని నేను తపముచేసికొనుచుందును. నామనస్సు చలించుటకును, నాతపస్సు విఘ్నమగుటకును ఒక రాక్షసుడు తన మాయాబలమున సింహము, ఏనుగు, పెద్దపులి మొదలగు మృగముల ఆకారములుధరించి నా ఆశ్రమమునకువచ్చి అల్లరిచేయుచుండును. తలచుకొన్నచో కోపాగ్నివలన ఆరాక్షసుని భస్మముచేయగలను. కాని అందువలన అగు తపోవ్యయమునకు శంకించితిని. అట్టిశంకతో వ్యాకులపడుచు నేనొకసారి ఆకాశము దిక్కు మొగమై నిట్టూర్పువిడిచి

తిని. అప్పుడా ఆకాశప్రదేశము నుండివచ్చి ఈగుఱ్ఱము నాయెదుట నిలిచినది. ఆకాశవాణి అంతట ఇట్లు చెప్పినది, 'మునీశ్వరా ! నీకీ గుఱ్ఱమును సూర్యభగవానుడు పంపినాడు. బలసంపదచే ఈగుఱ్ఱ మొక చిటికకాలములో ప్రపంచ మంతయు క్రుమ్మరగలదు. దీనికి తిరుగరాని చోట్లులేవు. నీళ్ళయం దుపోవును– పర్వతములందు సంచరించును. ఆకాశమున చరించును. పాతాళలోకమున క్రుమ్మరును. వేయేల చెక్కుచెమర్పకుండ సకల దిక్కులు చుట్టిరాగలదు. ఎంత దూరమేగినను అలసట పొందదు. దీనికున్న కువలయసంచార సామర్థ్యమున ఇది కువలయమనుపేర ప్రసిద్ధికెక్కినది. శత్రుజితుమహారాజు పుత్రుడైన ఋతధ్వజుడీ గుఱ్ఱమునెక్కి నిన్ను బాధించుచున్న రాక్షసుని సంహరించును. ఆలస్యముచేయక నీవు దీనిని గొనిపోయి విక్రమతేజోధనుడగు ఆరాజ కుమారునకు సమర్పింపుము.

ఆకాశవాణి వచించిన మాటలకు నాకెంతో సంతోషమైనది. ఇదే నీకీగుఱ్ఱమును నివేదించుచున్నాను. నాతపమునకు విఘ్నము కలుగచేయుచున్న రాక్షసుని సంహరించుటకు నీకుమారుని నియోగించి ధర్మరక్షణము చేయుము.'

శత్రుజితు మునీశ్వరుని మాటలు ఆదరించినాడు. వెంటనే తన కుమారుని ఆగుఱ్ఱముపై నెక్కించి మునీశ్వరునితోకూడ పంపినాడు. మునీశ్వరుడు ఋతధ్వజుని తోడ్కొని తన ఆశ్రమమున కరిగెను. అందుతో కువలయమను అశ్వమును పొందుటచే అతడు కువలయాశ్వుడని పేరొందెను.'

౪

అని నాగకుమారులు చెప్పగా అశ్వతరుఁడు విని విస్మయమందెను. 'బహుచమత్కారముగ నున్నదే. తరువాత కథకూడ చెప్పుడు. వినుటకు కుతూహలమగుచున్నది.' అని అశ్వతరుడనెను. అందుమీద నాగకుమారు లిట్లు చెప్పదొడగిరి.

శౌర్యమూర్తి కువలయాశ్వకుమారుడు గాలవాశ్రమమునగల మునీశ్వరులకు ఎట్టి తపోవిఘ్నములును గలుగకుండ అతిజాగ్రత్తతో కాచుచుండెను. అందుపైని రాక్షసుడు కువలయాశ్వకుమారుని, గాలవమునిని చంపుటకు ఉద్యమించెను. ఉగ్రవరాహరూపముతాల్చి ఆకాశము పగులునట్లు ఘుర్ఘురింపుచు, కన్నుల నిప్పులురాల్చుచు, భూమి వడకునట్లు నడుచుచు రాక్షసుడు వచ్చెను. వెంటనే ఋతధ్వజుడు గుఱ్ఱమునుఎక్కి విల్లెక్కుపెట్టి అర్ధచంద్రమను పేరుగల బాణమువేసి ఆపందినిగొట్టెను. ఆ దెబ్బ పందికి నసాలమంటినది. భయముతో అది అడవులు కొండలు అతిక్రమించి పరుగిడ ప్రారంభించినది. ఋతధ్వజుడు దానిని అంతతో పోనీయక వెనుదగిలినాడు. అట్లు ఆపంది వేయియోజనములు పరుగెత్తి కటికిచీకటితో నిండియున్న ఒక భూగృహముద్వారా పాతాళలోకమునకు దిగబడినది. కువలయాశ్వుడును భూగృహము దిగిపోయినాడు. పోగా-పోగా అతనికి కాంతివంతమైన నగరమొకటి కనిపించినది. కాని పందిజాడ ఏమియు కనిపింపలేదు. గొప్పకోట, బంగారపుమేడలు; గుళ్లు గోపురములు కలిగి ఆపట్టణము ఇంద్రుని నగరముతో సరిపోల్పదగియుండెను. నగరసౌందర్యమునకు మెచ్చుకొనుచు ఋతధ్వజుడు రాక్షసుని పొడగానక అటుఇటు తిరుగుచుండెను.

౫

అప్పుడాతఁడు హుటాహుటి నడలతో పోవుచున్న ఒక్క స్త్రీని చూచెను. 'తరుణీ! ఎవ్వరిదానవు. ఎక్కడికి పోయెదవు' అని కువలయాశ్వకుమారుఁడు ఆస్త్రీని ప్రశ్నించెను. మాఱుమాట పల్కక ఆమె దగ్గరనున్న మేడమీదకుపోయినది. వెంటనే రాజకుమారుడును గుఱ్ఱముదిగి దానిని అక్కడ కట్టిపెట్టి ఆస్త్రీఎక్కిపోయిన మేడ మీదకు వెళ్ళెను. అచ్చట మణులు చెక్కిన బంగారపు మంచము మీద ఒకసుందరి ఉండెను. అతడామెను చూచెను. ఆమె కుసుమ కోమలాంగి. అపూర్వలావణ్యవతి. పాతాళలోకమున విహరించు ముచ్చటతో వచ్చిన వరుణదేవి

రెయో అనునట్లును, స్త్రీరూపము తాల్చిన శృంగారరసమో అనునట్లును, భాసురాకారము తాల్చిన నాగకుమారియో అనునట్లును ఉన్న ఆ కన్యకామణిని చూచి ఋతధ్వజుడు మోహావివశుడైనాఁడు. ఆసుందరియు రాకుమారుని కాంచి దిగ్గున మంచముదిగి సంభ్రమము, భయము, విస్మయము, రాగము, లజ్జ ఒక్కసారే మనస్సును కలఁతపెట్టుచుండఁగా వడకు మేనితోఁ జెలికత్తె మాటునకుఁబోయి నిలచినది. అప్పటినుండి తన విలోచనమధుకరద్వయమున ఆతని సౌందర్యమధువు గ్రోలినది. రాకుమారుని అపూర్వ సౌందర్యము తనివివార చూచి తలయూచినది ; ఆనందించినది ; పరవశయైనది; మూర్ఛపోయినది.

చెలికత్తె ఆమె మొగమున చల్లని నీళ్లు చిలకరించి విసనకఱ్ఱతో విసరి సేదతేర్చినది. అప్పుడు ఋతధ్వజుడు ఆమెను 'తరుణీ! నీవీ విధముగా మూర్ఛపోవుటకుఁగారణమేమి?' అని అడిగినాఁడు. అందుమీఁద ఆమె చెంతనున్న చెలికత్తెను కడకంటితో చూచినది. ఆకడకంటిచూపులో లజ్జ, దైన్యము నిండియున్నవి. స్థితిని గ్రహించి చెలికత్తె రాజకుమారునితో ఇట్లన్నది: 'అయ్యా! మీచక్కదనము చూచి మాచెలి పారవశ్యము చెందినది. ఈమెవృత్తాంతము తేటపఱతును వినుము. విశ్వావసుడను గంధర్వరాజు. ఈమె అతనికూతురు. పేరు మదాలస. ఒకనాడు ఈమె పూలతోటలో విహరించుచుండెను. పాతాళలోకమునకు ఏలిక అయిన పాతాళకేతుడను రాక్షసుడు ఆ సమయమున తన మాయాబలముచేత ఈమెను తెచ్చి ఇక్కడ ఉంచినాడు. రేపురాత్రి ఈమెను పెండ్లి ఆడుదునని ఉప్పొంగుచున్నాడు. ఇట్టి సౌందర్యవతికి అట్టివాడు మగడు కాదగినవాడేమో ఆలోచింపుము. వానిని పెండ్లిఆడుటకు ఇష్టములేక ఈమె నిన్నరాత్రి ప్రాణములు త్యజింపచూచినది. మరణవ్యవసాయమున ఉన్న మదాలసతో అప్పుడు సురభి ఇట్లు పలికినది: 'తరుణీ! ఈ రాక్షసుడు నీకు భర్త కాడు. మనుష్యలోకమునకు పోయినప్పుడు ఏనరుడు వీనిని బాణములతో వేయునో ఆతడు నీభర్త కాగలడు. కావున ఊరడిల్లుము నీకు శీఘ్రకాలములోనే శుభము కల్గును.''

సురభిచెప్పిన ఈమాటలవలన మదాలస మరణప్రయత్నము మానినది. నేను ఈమెచెలికత్తెను. నన్ను కుండల అందురు. వింధ్యవంతుని కూతురను. నాభర్త పుష్కరశాలి. శుంభుడను రాక్షసునిచేత మృతుడైనాడు. అప్పటినుండియు నేను పరలోకమునందు తాత్పర్యముంచి ఆకాశమార్గమున పోవుచు తీర్థయాత్రలు చేయుచుంటిని. అట్లు తీర్థయాత్ర చేయుచుండగా పందిరూపముతో ఉన్న పాతాళకేతుడు ఒక రాజకుమారునిచేత ఏటువడి పరిగెత్తుచుండుట చూచితిని. సురభి చెప్పినమాటలు జ్ఞప్తికివచ్చి ఏమి జరుగునో చూతమని వాని వెనుకనే మరలి ఇచ్చటికివచ్చితిని. మీ సౌందర్యము ఈమె కన్నులకు, చిత్తమునకు ఇంపు సొంపు ఒనర్చుచున్నది. ఈమెహృదయమున మీమీద ప్రేమ నెలకొనియున్నది. రాక్షసుని కొట్టినవాడు నీపతి అగునని సురభి ఏర్పడ చెప్పినది. కాని ఈచిక్కు ఎట్లుతీరును ? ఈమెను కష్టపెట్టుటకు దైవము ఈ క్రొత్త చిక్కు తెచ్చిపెట్టెనేమో! పుట్టినప్పటినుండి ఈమెకు దుఃఖములే. ఈమెకు వివాహమైనతోడనే పోయి తపముచేసి గతించిన నాపతిని పొందవలయునని కనిపెట్టుకొని ఉన్నాను. పుణ్యాత్మా! మీరు ఎవ్వరు? ఎందుకొఱకు ఇచ్చటికి వచ్చితిరి. మీరు దేవకుమారులో? నాగకుమారులో? గంధర్వులో? కిన్నరులో ? అయిఉందురు. మనుష్యరూపముతో ఇచ్చటికి వచ్చినారు. మీసౌందర్యము చూచి మిమ్ముల మనుష్యులుగా భావింపలేకున్నాము. మీవృత్తాంతము దయచేసి కొంచెము మాచెవిని వేయుడు.'

౭

అందుమీద ఋతధ్వజుడు ఇట్లు చెప్పినాడు. 'కుండలా! నేను దేవకుమారుని కాను, నాగకుమారుని

[మిగతా ౨౦౪ పేజీలో.

## 'నాకోసం వచ్చిన మనిషి మా చూపులను అనుమానించాడు'

# ద్రాక్షపండ్లు పులుపు

'పుల్లగావున్నాయి.' అంది—నాకు లోపల చాలా కోపంవొచ్చింది. మామధు తెచ్చిన పండ్లను పుల్లగా వున్నాయంటుందా? చచ్చిపోయిన భర్త వస్తాడన్న నమ్మకంతో ఫోటోని పూజిస్తూ, తన యౌవనసౌభాగ్యాన్ని నిర్మూలంచేసేందుకు చీకటిముసుగులో దాగుతున్న మా అక్కకుమధులోనిమాధుర్యం ఏమి తెలుస్తుంది?

రచయిత :

'బుచ్చిబాబు'

౧

ఆమధ్య పత్రికలలో, పాశ్చాత్యదేశాలలో, స్త్రీసౌందర్యాలలోకూడా పోటీపరీక్ష పెడతారనీ, అందులో, విమర్శకులచేత, ప్రశంశింపబడి అగ్రస్థానంపొందిన వాళ్ళకి బహుమతీ యిస్తారనీ చదివాను. మన సంఘంలోకూడా, అట్లాంటి పోటీ యేదేనా పెడితే, నాకూ, మాఅక్కయ్యకూ ప్రథమ ద్వితీయ బహుమతులు తప్పకుండా వొచ్చితీరుతాయని అతిశయం లేకుండా చెప్పగలను. మాసౌందర్యం, కాలంమళ్ళి, యవ్వనాన్ని శిథిలంచేసుకున్నవాళ్ళని సహితం, చక్కలిగింతలాగ చలింపచేస్తుంది. దానికి వొక పెద్దమనిషి (అంటే వయస్సులో నన్నమాట) రైల్లో మాతో ప్రయాణంచేస్తూ, తను దిగవలసినచోటు మర్చిపోయి, మాతోకూడాదిగి, రైలు వుద్యోగుల హేళనకి పాత్రుడైన సంగతి తార్కాణం. అందుకనే, మేం, అప్పడినుండీ, అమావాస్యనాడేకాని ప్రయాణం చెయ్యడం మానివేశాం. ఒకసారి నేను బట్టలకొట్లో చీరె కొన్నప్పుడు, దుకాణం యజమాని చీరఖరీదు యివ్వమని అడగడం కూడా మరిచిపోయ్యాడు. నాటకాలలోకాని, రైళ్ళల్లోకాని, మళ్ళీ టిక్కెట్లు యిమ్మని యెవ్వరూ అడిగినట్లు గుర్తులేదు. అంతవరకూ యెందుకు? మాఅక్కయ్య పెళ్ళికి, మంత్రాలుచదివే బ్రాహ్మణుడు, మాఅక్కకేసిచూస్తూ, మంత్రాలుచదవడం, మానేశాడన్నసంగతి నమ్మకపోయినా, తప్పుడుమంత్రాలు చదివాడన్న సంగతేనా నమ్మితీరాలి. ఇల్లాగే అనేకవిధాలగా, మాసౌందర్యాన్ని అభినందించిన వ్యక్తులందరికీ, నాకృతజ్ఞతావందనాలు తెల్పుకున్న తరవాత, నాకథ ప్రారంభిస్తాను.

అసలు కథ యేమీ లేదు. 'కథ' అనడం బదులు,'కసి,' అని, అనడం మంచిదిలా తోస్తుంది నాకు. ఇందులో సంగతులను మార్చి, అందఱూ చదివేటంతటి యింపుగా వ్రాయడం నాకు చేతకాదు. మాసౌందర్యాన్ని చూచి మోసపోయినవ్యక్తులు, నా కబుర్లను మాత్రం విశ్వసించరా అన్న ధైర్యంతో మొదలెడతాను.

మాఅక్కను పెండ్లిచేసుకున్న తర్వాత, మాబావకు, తన పెంపుడుకూతురికి వివాహంచెయ్యవలసి వొచ్చింది. మాబావ, కొంచెం లావుగా, మోటగా, భయంకరంగా కనపడినా, మాఅక్కను, చాలా సున్నితంగానూ, యెంతో మర్యాదతోకూడిన ఆప్యాయం

తోను ప్రేమించేవాడు. నాకు మా అక్కదగ్గరకంటెకూడా, మా బావ దగ్గరే చనువు. ఆయన మమ్మల్నింత ప్రేమతో చూడడానికి కారణం, మా బీదతల్లిదండ్రులు, వృద్ధులైనా, మా బావ ఉద్యోగం, హోదాలనుచూచి, ఆయన సంపదకి, మమ్మల్ని అమ్మివెయ్యడమే కారణం. నేనుచూసి వృద్ధులు, యెప్పుడూ ముక్కుతూ, మూల్గుతూ, విసుగుకుంటూ, యెందుకొచ్చిందిరాబాబు యిదంతా, అని, అనుకునేవాళ్ళే. కాని మా బావమాత్రం మొదటిభార్య పోయినందుకు, లోపలవున్న విచారాన్ని మాదగ్గఱ కక్కకపోవడం సరికదా, రోజురోజుకూ, మరింత, యావ్వనుడులాగ ప్రవర్తించటంకూడా మొదలెట్టాడు.

నేను, మాఅక్క అందరి సవతితల్లులమల్లేకాక, ఆయన పెంపుడుకూతుర్ని, సొంతచెల్లెలులాగా చూసేవాళ్ళం. మేం, ముగ్గురం, ప్రొద్దున్న, స్నానాలగదిలోకి దూరి, బైటపడేటప్పటికి, వొక సబ్బుబిళ్ళ అరగడంకాకుండా, మా బావ, మధ్యాహ్నం నిద్రపోయి, లేవడంకూడాజరిగేది. అంత గాఢమైన స్నేహం మాముగ్గురికీ.

మా బావకూతురివివాహసందర్భంలోనే, నేనూ, మధుసూధనం మొదటిసారి కలుసుకోడం జరిగింది. మధు పెండ్లికొడుకు తమ్ముడు; చాలా చులుకుగామాట్లాడి, తన్ని పదిమందీ చూసేటట్టు చేసుకోనే, చమత్కారం వున్నవాడు.

అప్పుడతనికి పదునాల్గేండ్లకంటె యెక్కువ వుండవు. నేను అతనికంటె, రెండేండ్లే చిన్నదానను. ఆ సాయంత్రం, (అంటే, మనుగుడుపులకువొచ్చినప్పుడు) దాగుడుమూతాలాడుకుంటూ, నేను దాక్కుందామని వాళ్ళకి, విడిదిగా యిచ్చిన గదిలోకివెళ్లాను. సాయంత్రం ఐదుగంటలకి మొగాళ్ళంతా బైటికెళ్లేసమయం కావడంవల్ల, నేను నిర్భయంగా ఆగదిలోకి వెళ్ళగలిగాను. వెళ్ళి పైగా లోపల ఘడియకూడాపెట్టి, ప్రక్కకు తిరిగాను. మధు నిద్రపోతున్నట్లుగా పడుకున్నాడు. సిగ్గువల్ల బైటికివెడదామనిపించిందికాని, అతన్ని చూడాలనివుంది. ఆపొట్టికాకీలాగు పొడుగుచేతులుగల చారలచొక్కా, జేబులో ముల్లులేని పెనసలు, నుదుటిమీద చిన్న గాయంపడ్డ మచ్చ, నవ్వి అల్లరిచేసే చిన్ని పెదవులు, అతికించినట్టుగావుండే కనురెప్పలు, నేను యెప్పుడూ మరిచిపోను. సగంకళ్లు తెరచి, సన్నగా నావంకచూసి పెదవులను కదల్చాడు. నేను తలుపుదగ్గఱకు వెళ్ళబోయాను.

'ఏ అమ్మాయి, యిల్లారా, యెవర్నువ్వు?' అన్నాడు. సమాధానంచెప్పకపోయినా, అతన్ని చూసి, కొంటెగా నవ్వాను.

'మొగాళ్లున్నగదిలోకి రావొచ్చునా?' అన్నాడు, గీర్వాణంగా. నాకు కోపంవొచ్చింది.

'నువ్వు, ఆడాళ్లున్నచోట దొంగనిద్ర పోవొచ్చునా?'అన్నా. బిగ్గఱగా నవ్వాడు.

'నాయిష్టం. ఇది మాగది' అన్నాడు.

'అబ్బో, యిదీ నాయిష్టమే. ఈమేడ మాస్వంతం. మా బావది.. నువ్వుయెవరవ్ అడిగేందుకు?' అన్నా ధైర్యంగా.

'జాగ్రత్త- ఎంతమాటంటే అంతమాట అనొచ్చునా? భయంభక్తీ లేకండా డాబామీద మీరు గంతులేస్తే మాకు, యెట్లా పడుతుంది నిద్ర' అన్నాడు.

'ఇప్పుడేంనిద్ర? నీకేమన్నా జబ్బు చేసిందా? రోజూ స్కూలుపిల్లలు, బ్యాట్ బంతి ఆడుకుంటారు. నువ్విల్లాకూర్చున్నావేం? మా బావలాగ నీకేమన్నా శరీరం బరువా?' అని, నేనుకూడా నవ్వాను తెగించి. ఇంతలో, నాకోసం బైటకేకలు పెడుతున్నారు. నేను తలుపువెంపుకి నడిచాను. అతను మంచందిగి నాముందు నిలబడ్డాడు. ఇంక వెడతానన్నట్లుగా అతనివంక చూచాను.

'ఈపరికిణీగుడ్డ యెవ్వాళ్ళో కొన్నావ్?' అన్నాడు, పరికిణీ వేళ్ళతో ముట్టుగుంటూ.

'వొదులు, అదేమిటి ఎక్కడ కొంటే నీకెందుకు? మా బావ కొట్లో కొన్నాను.'

'మీబావకి బట్టలకొట్టుకూడా వుందా?' అన్నాడు.

'అదే, కాతాలకొట్టు' అని, ఘడియమీద చై వేశాను. అస్తమించే సూర్యుడికిరిణాలు కిటికీలోంచి నాకళ్ళల్లోకి పచ్చగా పాడుస్తున్నాయి. ఆవెలుగులో వుండటంబట్టి, నీడలోవున్న అతని మొఖము నాకు సరిగా కనపడడం లేదు.

'నే కూడ మీతో ఆడనా?' అన్నాడు.

'అబ్బే, ఛీ- నువ్వు మొగాడవ్ కాదు? అన్నా.

'అయితే వెళ్ళిపోతావా ?' అన్నాడు.

'ఏం, వొద్దూ?' అన్నాను. వెంటనే నామెడకాయ వెనకాల తన చేతులను గట్టిగా చుట్టుబెట్టి, నా పెదవులను, కోరికేటంతపని చేసాడు. ఒకేసారి చాలాసేపులావున్నా అనేకసార్లు తీసుకున్న మొదటిముద్దు అది.

'చెప్పనా?' అన్నా, మెల్లగా.

'వొద్దు—'

ఈ వివాహంజరిగిన నెలరోజులకి మధుసూధనం అన్నగారితో కూడా పండగకి మాయింటికొచ్చాడు. ఆసాయంత్రం నేను మా బావపొట్టమీద పడుకుని. ఆయన బొడ్డులో అగ్గిపుల్లదూరుస్తూ కూర్చున్నా.

'ఏమోయ్ మధూ, మామరదల్ని చేసుకుంటావా ? ఈడూజోడూ బాగుంటుంది' అన్నాడు. నేను మాబావ పొట్టమీద గట్టిగా కొట్టాను.

'అబ్బ, కొట్టకే—చూడు మీద నుండితే—అవతల, నీమొగుడు వొచ్చి కూర్చున్నాడు' అన్నాడు. నేను లేవలేదు.

'ఈఅమ్మాయి చాలా అల్లరిదండి' అన్నాడు, మధూ...

'మాభార్గవేనా— చాలాఅల్లరిదోయ్. నువ్వు మాన్పాలి, యీ అల్లరివేషాలని' అన్నాడు.

'మరే- మాన్పుతాడు' అన్నా నేను.

'తప్పు. అల్లా అల్లాఅనకూడదమ్మా' అన్నాడు. ఇంతలో మా అమ్మా, వాళ్ళమ్మా అంతా పోగయి, మాయిద్దరికీ పెండ్లిచేద్దామనీ, అప్పుడే పెండ్లయిన వాళ్ళ కిందకట్టి, వేళాకోళంగా మాట్లాడం మొదలెట్టారు.

'మీఅమ్మాయికికూడా చదువుచెప్పించండి— పెద్దయింతర్వాత, వాళ్ళయిష్టమొచ్చినప్పుడు చేసుగుంటారు' అంది, వాళ్ళ అమ్మ.

'నువ్వే తప్పకుండా, చేసుగుంటానని చెప్పి, చేతులో చెయ్యి వెయ్యి' అంది మాఅమ్మ. అంతా పట్టుబడితే, అతను చెయ్యివేసాడు మాబావ నాచేతిని తీసిగిల్ల్ని అతనికి

అందజేసాడు. మేం యిద్దఱం సిగ్గుతో చూసుకుని నవ్వుకున్నాం.

౨

ఇది జరిగిన, నాలుగుమాసాలకే, మాబావ జబ్బుచేసి, అకస్మాత్తుగాపోయాడు. చాలాభాగం ఆస్తి మా అక్కయ్యపేర వ్రాసిపోయాడు, అందులో పెంపుడు కూతురుకికూడా, కొంతభాగం వుందనీ, వున్నవిల్లు కల్పించి మాచేత వ్రాయబడిందనీ, మాకు, మధుసూధనం తాలూకువాళ్ళకి, చాలా మనస్పర్థలు వొచ్చాయి. మాబావ పోయిన కొద్దిరోజులకే, ఆయన కట్టించి అద్దెకిచ్చిన మేడలోకి వెళ్లిపోయాము. ఆనాటినుండి మాకు మధుతాలూకువాళ్ళకి, ఉత్తర ప్రత్యుత్తరాలు, రాకపోకలు, యిచ్చిపుచ్చుకోటాలూ లేవు.

మా అక్కయ్య చాలా పతివ్రత. రోజూ ఉదయం సాయంత్రం కూడా భర్తఫోటోకి పూజచేస్తూ, ఆయన్ని స్మరించుకు విచారిస్తూ వుండేది. నేను అప్పుడప్పుడు, హేళనగా పోయినవాళ్ళకోసం, విచారం యెందుకూ అనేదాన్ని; మా అక్కయ్య కోపంవొచ్చి నాకు వొక చెంపకాయ తగిలించేది. కాని నేనుమాత్రం చచ్చిపొయ్యినవాళ్లు మనకోసం యెదురుచూస్తుంటారన్న విషయం నమ్మేదాన్నికాదు. ప్రాణంతోవున్న మనం పోయినవాళ్లు మళ్లావొస్తారనిగాని, మనం వాళ్ళవొద్దకి చేరుకుంటామనికాని నమ్ముతున్నామా? మాఅక్కయ్య భర్తతో సుఖంగా కాపరంచేస్తున్నవాళ్ళనుగురించి నిరశించి మాట్లాడినప్పుడూ, స్త్రీలను, యితరులసౌఖ్యాలకోసం, దేహాలు అమ్ముకున్నందుకు దూషించడం చూసినప్పుడు, నాపెండ్లిమాటలు చెప్పేటప్పుడు, అదిచూపే యీర్ష్యాపూరితమైన, యీసడింపు వాక్యాలు విన్నప్పుడూ, 'నక్క అందని ద్రాక్షపండ్ల' కథా స్మరణకువొచ్చేది.

వేసంగిసెలవలకి యేదో వూరు వెడుతూ, మధు తల్లితోకూడా మాయింట్లోదిగాడు. ధనం ఆస్తుల విషయంలో వాళ్ళకి వాళ్ళకి యేవిరోధాలున్నా, మధుసూధనంతల్లికి మేమంటే చాలా ఆదరణ.

'మీభార్గవికి పెండ్లి యీడొచ్చింది. ప్రయత్నాలుచేస్తున్నారా!' అంది మధుతల్లి.

'ఎందుకండీ, మీమధుకి యిద్దామని, యిదివఱకే వాగ్దానం చేసుగున్నాంకా. పైగా, పోయేటప్పుడు మా అల్లుడుకూడా అతనికే యిమ్మని మరీమరీ చెప్పాడు.' అంది, మాఅమ్మ.

ఆసాయంత్రం అందరూగుళ్లోకి వెళ్లారు. నేనొక్కదాన్ని కూర్చుని పాడైపోయిన హార్మోనియమ్ వాయించుగుంటున్నాను. ఎల్లా వొచ్చాడో మధు గదిలోకివొచ్చాడు.

'నే వాయిస్తా, నువ్వు పాడు' అని, వాయించడం మొదలెట్టాడు.

'ఏంపాడను? ముందర నువ్వు పాడు' అన్నా.

'ఏదో నీకొచ్చింది చిన్నప్పుడు, సత్యభామ వేషం వేసావుగా స్కూలులో' అన్నాడు.

'ఇప్పుడు జ్ఞాపకంలేదు' అన్నా.

'అబ్బ పాడుదూ— మళ్లామీవాళ్లు వొచ్చేవేళయింది. ఏదీ మీరజాలగలడా' అందుకో.

'మీరజాలగలడా నాయానతి వ్రతవిధానమునకున్ . . . ' అని మొదలెట్టాను. వాయించడం మానేసి, నన్ను తన వొళ్లోకిలాక్కొని జడను సవరిస్తూ, నుదురికి మళ్లా తన అధరాలని తగిల్చాడు. నూనూగుమీసాలరాపిడికి, నావొళ్లు జల్లుమంది. అప్పుడే యీ ప్రపంచంలో నే నిజంగా జన్మించాను. జరిగిపోయినవన్నీ, జన్మించేందుకు పడ్డ కష్టాలే.

'నువ్వు బాగామారిపోయావు' అన్నాడు.

'అంటే?' అని వోరగా చూశాను.

'కొంచెం, యెదిగి పెద్దదానవయ్యావ్—ఇదివరకుకంటె చాలా అందంగావున్నావ్' అన్నాడు.

'నిజంగా—నే అందంగావున్నానా? మధూ! నాకు నువ్వేబాగుంటావ్' అన్నాను.

'నేనేం బాగుంటాను? నీనీడలో కూడా నుంచోడానికి అర్హత లేదు. నాకేకాదు, సౌందర్యలో నీప్రక్కనునుంచోడానికి అర్హులైన, స్త్రీలను కాని, పురుషులనుకాని నేనింతవఱ

కూ చూడలేదు.'

ఆమాటలు వింటోంటే, నామనస్సు యెగిరిపోయి 'అందం' అన్న పాట పాడుకుంటూ బంగారపు పుష్యాలలో వూగుతున్నట్టుగా వుంది.

'ద్రాక్షపళ్లు తెచ్చావే—నాకోసమేనా?' అన్నా, యేదో మాట్లాడిద్దాంకదా అని.

'అవును నీకోసమే...'అని, వొకటి తెంపి నానోట్లో పెట్టాడు.

'మరినువ్వు తినవు. పట్టు, నోరట్టు' అని, నేకూడా వొకటి అతని నోట్లో పెట్టాను.

'ఎల్లావున్నాయి?' అన్నాడు.

'తియ్యగా, భలేగావున్నాయిలే—ఎక్కడకొన్నావ్?' అన్నా.

'నీపెదవులు వాటికంటె తీపి' అన్నాడు.

'చాల్లెద్దూ—అన్నీ వొట్టిమాటలు' అన్నా.

'కాదు. నిజం. నువ్వు దేవకన్యవు. భూలోకంలో పొరపాటున పుట్టావు... నిన్ను ముట్టుకునేందుకు కూడా, యీప్రపంచంలో యెవ్వరికి హక్కు లేదు' అన్నాడు.

'పోనీ, నీకుకూడా లేదు, హక్కు' అన్నా, ఇంకా వేళాకోళంగానే.

'లేదు నీపాదాలక్రింది దుమ్ముని, నీళ్ళల్లోకలిపి, ఫేస్‌పౌడర్‌క్రింద మొహానికి రాసుగోవచ్చును' అన్నాడు. నాకు పట్టరాని నవ్వు, సంతోషం వొచ్చాయి. నాకు తెలియకుండానే అతని బుగ్గలని గట్టిగా నొక్కి అల్లరిచేసాను...

తరవాత చాలాసంగతులు మాట్లాడుకున్నాము. ఎందుకో అతను మాట్లాడేవిధంలో విచారం, భయం, అస్వతంత్రత నాకు స్ఫురిస్తున్నాయి. నాసర్వం, నాగర్వం కూడా అతనిసొత్తు చేస్తున్నా. అతనికి విచారం యెందుకు?

'నువ్వు యిదివరకంత సరదాగా లేవే?' అన్నాను.

'అది చిన్ననాడు. మనవాళ్ళ కలహాలు నువ్వు యెరుగుదువు కదా...మనకి వివాహం జరుగుతుందని...'

'వివాహంయెందుకూ?' అన్నా నాకప్పుడు వివాహం, దాంపత్యం, సంసారం, వీటి అవసరం ప్రాముఖ్యత కనిపించలేదు. నా ధైర్యంవొక్కటే. ఏకాంతంగా వున్నప్పుడు మధు నాసౌందర్యాన్ని పూజిస్తూ తనలో కలుపుకుంటాడు కదా అన్నది.

'మధూ...నిన్నుమరచి పోతానా...నాసంగతి నీకింకా తెలీయదు...'

'నువ్వు చిన్నపిల్లవు, భార్గవీ! నీకింకా తెలియదు.'

'అబ్బొ మహా నువ్వు పెద్ద కొండంతవాడవు అయినట్టు!' అన్నా. అతనికళ్ళల్లో విచారం చుక్కల రూపంగా మెరిసింది.

'చూడు, నిధీ- దానికి సాక్షి' అని, గాజుని బ్రద్దలకొట్టి పదునైన

ముక్కతో నాకంఠంకింద గీచి, ఆరక్తంతో, అతని చేతిలో యేవో పిచ్చి అక్షరాలు వ్రాశాను. ఇంతలో మావాళ్లు వొచ్చిన చప్పుడైంది.

*  *  *

ఆ రాత్రి.

'అక్కా! ద్రాక్షపళ్లు తిను...' రెండు తింది.

'ఎట్లావున్నాయి?' అన్నాను.

'ఎవరు తెచ్చారు?' అంది.

'మధుసూధనం, ఊ' అన్నాను.

'ఊ యెందుకు నీకు తెలియనట్టు! పుల్లగావున్నాయి' అంది- నాకు లోపల చాలా కోపంవొచ్చింది. మా మధు తెచ్చిన పండ్లను పుల్లగావున్నాయంటుందా? చచ్చిపోయిన భర్త వస్తాడన్న నమ్మకంతో, ఫోటోని పూజిస్తూ, తన యౌవ్వనసౌభాగ్యాన్ని నిర్మూలంచేసేందుకు చీకటి ముసుగులో దాగుతున్న మా అక్కకు, మధులోని మాధుర్యం యేంతెలుస్తుంది?

## 3

తరవాత, నేను మా అక్క స్కూలుకి వెళ్ళి చదువుకోవడం మొదలెట్టాము. మా అక్కయ్యను వంచించి దాని శరీరం తమ వశంచేసుకునేందుకు చాలామంది ప్రయత్నించారు. కాని మా అక్క యెవరికీ లొంగలేదు. నాకు, మా అక్కకు సహజంగా సౌందర్యంవల్ల ఆపాదింపబడే గర్వం చాలావుంది. సూర్యాస్తమయం అవుతుంటే, ఆకాశంకేసి మావెన్నులు త్రిప్పే వాళ్లల్లోకి చేరతాము. మా అమ్మ నాన్నకూడా, మా అక్కయ్యని యేవిధంగానూ నిర్బంధించలేదు కాని మళ్లా వివాహంచేసుకోమని, అన్యథా ప్రవర్తించమనిగాని ప్రోత్సహించలేదు. మళ్లా పెళ్ళిచేసుకుంటే, మా ఆస్తిఅంతా పోతుంది. ఏమో తీరాచేసుకుంటానంటే? అంచేత మావాళ్ళు చాలా భయపడి నన్నుకూడా భాగ్యవంతుడికి అమ్మాలని లోలోపల యత్నాలు చేస్తున్నారు.

ఆసాయంత్రం క్లబ్‌లోకి టెన్నిస్ ఆటను చూడడానికి స్కూలునుంచివొస్తూ వెళ్లాము, మా అక్కకు యీ ఆట్లంటే గిట్టకపోయినా నేనే బలవంతంగా తీసికెళ్లాను. చీకటిపడి యింటికి వొస్తూంటే, వొకాయన సైకిలుదిగి మాముందు నిలబడ్డాడు.

'మీరు యెవరితాలూకు?' అని మాఅక్కయ్యని ప్రశ్నించాడు. సిగ్గుతో మాఅక్క సమాధానం చెప్పలేదు.

'మేం స్కూలులో చదువుకుంటున్నాము' అని నే సమాధానం చెప్పా, మానాన్న పేరుకూడా చెప్పి.

'మీకు పెండ్లిఅయిందా?' అన్నాడు, సైకిల్‌వ్యక్తి. పెద్దపెద్ద మీసాలు లావుగా యెత్తుగా, మా బావను స్ఫురింపజేస్తాడు.

'నాభర్త గతించాడు' అంది మాఅక్క.

'అమ్మాయి! నీవేరేమిటి? నన్ను పెండ్లి చేసుగుంటావా?' అన్నాడు. చూడండి పురుషుడు స్వార్థంకోసం యెంత అసహ్యంగా ప్రవర్తించగలడో. నేను దానికి ఇంగ్లీషులో సమాధానం చెప్పా.

'దయవుంచి, అల్లాంటి తుంటరి ప్రశ్నలు వెయ్యకండి.' అన్నాం. ఐనా బిగ్గఅగానవ్వి మమ్ములను అతడు వెంబడించాడు.

రాత్రి యేంసంభాషణ జరిగిందో నాకు తెలియదుకాని అప్పుడే నావివాహానికి శుభలేఖలుకూడా వ్రాయించేయత్నాలు చేస్తున్నారు మావాళ్లు. మాఅక్క నాకోసం నాతరఫున నామధుకోసం చాలా గట్టిగా వాదించింది.

'నన్ను యిట్లాచేసారు, దాన్ని కూడా అట్లాచెయ్యడం మీకు సరదాగావుందా? వెధవడబ్బు మన కున్నది చాలదు? పైగా- మధు మట్టుకు బీదవాడా? నాలుగేళ్లల్లో అతను యీమాత్రం బి. ఏ, ప్యాసయి వుద్యోగం చెయ్యగలడు' అంది.

'నువ్వు ముందుముందు, పెండ్లి చేసుగుంటే?' అంది మాఅమ్మ.

'తప్పుడుకూతలు కుయ్యకు' అంది మాఅక్క. మాఅమ్మదాన్ని వొక లెంపకాయ వేసింది.

ఇల్లాగే మాతో దెబ్బలాటలాడుతూ, మా తల్లిదండ్రులు, నా పెండ్లియత్నాలన్నీ పూర్తిచేశారు. పిలుపుకీ, పేరంటానికీ మాకు మేం

తప్ప బంధువులు యెవ్వరూ లేరు. నేను మా అక్క రెండుమూడు రోజులు భోజనంకూడా చెయ్యకుండా, తలకి గుడ్డకట్టి జ్వరం అభినయించాం కాని లాభంలేకపోయింది. సన్నాయిమోతగూడా మెల్లిమెల్లిగా పెద్దదవుతూవుంది. నాకేమీ తోచక మధుకి స్కూలు అడ్రెస్‌కి వుత్తరం వ్రాశాను. అందులో కొంతభాగం యిది.

'......నావివాహం జరిగిపోతూంది, శుభలేఖ మీకు రాకపోయినా నువ్వు తప్పకుండా బయలుదేరి రావాలి. అంటే చూచి ఆనందించడానికి కాదు. నువ్వువొస్తే నేను నీవెనకాలచేరి అందర్నీ ధైర్యంగా యెదిరించి పుస్తె కట్టనివ్వకుండా చెయ్యగలను. ఆలగ్నానికి వివాహం జరగలేదంటే మనం యెల్లకాలం ఆనందంగా ద్రాక్షపండ్లను తింటూకూర్చోవచ్చు...'

నాకు తరవాత తెలిసింది. ఈ వుత్తరాన్ని అతని తల్లిదండ్రులు చూసి వెళ్లొద్దని, పిలవని పేరంటానికి పోకూడదని నచ్చచెప్పి అతనిచేత వెళ్లననే వాగ్దానంకూడా తీసుకున్నారు. పాపం చివరికి కొందరి స్నేహితుల ప్రోత్సాహంమీద అతను మావూరువొచ్చి, మాసందులోకివొచ్చి మాయింటికి పదిగజాలదూరంలోకి వొచ్చికూడా, 'ఆ, వెళ్ళేదేమిటి పోదూ - వాళ్ళకి మనికిచ్చి పెండ్లి చెయ్యాలన్న వుబలాటంవుండాలి కాని, మనంవెళ్ళి దేవురించడం మాహోదాకి లోటు కాదు? పైగా, భార్గవికంటె అందమయినవాళ్ళు చాలామంది వున్నారు...' అని, అందని ద్రాక్షపండ్లు పులుపన్న సంగతి మరిచిపోయి, ధైర్యసాహసాలను, ప్రేమను మానుషత్వాన్ని చంపుకుని మళ్లా యింటికి వెళ్ళిపోయాడు. మూడునెల్లకే మరో ఉత్తరం వ్రాశాను మధుకి స్కూల్ ఫైనల్ ప్యాసయిన పఠాన్న, ఎఫ్.ఏ. కి మా అత్తారున్న పట్నంలోవున్న కాలేజీకి రావలసిందని, దాని సారాంశం.

తెల్లారితే నన్ను మాఅత్తారింటికి తీసుకెళ్ళడానికి నాభర్త తాలూకు చుట్టంవొకడు వొచ్చాడు. ఆరాత్రే మధుకూడా మాయింట్లోనే దిగాడు. మాఅమ్మ, దొంగరాగాలు మొదలెట్టి అంతా విధి అనీ దైవసంఘటన వుండాలనీ యేవో బూటకపు మాటలుచెప్పి, ఓదార్ప ప్రయత్నించింది.

'చాల్లెండి, భలేపనిచేశారు. పైగా విచారంకూడా యెందుకు?' అన్నాడు. నాకోసం వొచ్చినతను చాలా అనుమానపడ్డాడు. ఎన్నిసార్లు మధుకి నాకువున్న బంధుత్వం చెప్పమన్నా అతను చెప్పలేదు.

నేనూ మధూ, వొకేబండిలో ప్రయాణంచేసాం. మేం యింటర్లో యెక్కాం అతను థర్డ్‌క్లాస్‌లో సామాన్లుపెట్టి యింజెన్‌ని పరీక్ష చేస్తూ నిలబడ్డాడు. నేనే మాపెట్టెలోకిరమ్మన్నట్లుగా సవుజ్ఞ చేశాను.

మాచూపులను అనుమానించాడు నాకోసం వొచ్చిన మనిషి.

తరవాత నెలలు గడిచిపొయ్యాయి. మధుకి నేను కనబడలేదు. మాయింటిజాడ తెలియక పిచ్చివాడిలాగు తెగతిరిగేవాడుట పాపం- నాభర్త, నాఅత్తగారువున్న యింట్లో కాకుండా నేను మాఅక్క మాఅమ్మ, ఆవీధులోనే వేరేయింట్లో కాపరంవుంటున్నాము. రాత్రి, రోజూ నాభర్త నాకోసం వొచ్చేవాడు.

మమ్మల్ని యిట్లా వేరే వుంచడానికి కారణాలు చాలావున్నాయి. నాభర్త మొదటిభార్య తనతోనే వున్నప్పుడు, యింట్లో అత్తగారిపోరు పడలేనని గోలచేస్తే స్కూలికి పంపేవాడుట. తరవాత ఆ అమ్మాయినిగురించి చాలాపుకార్లు బయలుదేరాయి. కొంతకాలానికి, ఆపిల్ల కాలంచేసింది. కొందరు ఆత్మహత్య చేసుకుందనీ, కొందరు అత్తగారివల్లనే బలవంతంగా చంపబడిందనీ చెప్పుగుంటారు. కాని, యిందలి రహస్యం నాతో నాభర్త యెప్పుడూ చెప్పలేదు. అల్లాంటివి జరగకుండా వుండడానికే మమ్మల్ని వేరేయింట్లో వుంచడానికి కారణం.

నాకు నాభర్తంటే చాలా భయంగావుండేది. లోపల చాలా కోపంగాకూడా వుండేది. వీటిని అన్నిటినీ మించినది నాసౌందర్యాన్ని స్థూలకాయుడై యౌవన సౌందర్యాన్ని యెట్లావుపయోగించుకోవాలో తెలియని, భర్తకి అర్పణ చేసుకుని ఆ సుఖాలలో, నేపూర్తిగా పాల్గొనకుండా పదిమందికి నన్నుగురించి, చెప్పుకోకుండా యెక్కడో చీకట్లో దాచిపెట్టడంవల్ల కల్గిన బెంగ. మా అత్తవారితాకు పిల్లాడు వొకడు కాలీజీలోనే చదువుకునేవాడు. ఒకనాడు బల్లమీదవున్న కాలేజీసంచిక తీసిచూచాను. అందులో మధురాసిన తెలుగుకథ చదివాను. నేను అంతకిపూర్వం అల్లాంటికథలు చదవలేదు. నన్నుగురించే వ్రాశాడని నాకు బాగాతెలుసు. రోజూ ఆ కథనిచదివి దానిమీద యేడ్చేదాన్ని.

౪

కొంతకాలానికి భర్త అభిమతంమీదనే నేను మా అక్క స్కూలుకివెళ్ళి చదువుకునేవాళ్ళము. రాత్రి భోజనంచేసింతర్వాత, ప్లీడరిగారి అమ్మాయిఇంటికి చదువుకునేందుకు వెళ్ళేదాన్ని రోజూను. ఆసాయంత్రం యేడుగంటలకు నల్లచీర తెల్లరెవిక వేసుకుని చేతులో పుస్తకాలుపుచ్చుకుని వెడుతున్నా. ఎదురుగా లాంతర్ స్తంభందగ్గఱ, నావెంపూనడుస్తూ మధుసూధనం కనిపించాడు. నేను గుర్తుపట్టి వీధిలోనే అతనిని నిలబెట్టాను. పుస్తకాలను కిందకి జారవిడిచి అతని చెయ్యినిపట్టుగుని యేడవడం మొదలెట్టాను.

'తప్పు. యేడవకు. ఇది పదిమందీ నడిచేరోడ్డు...' అన్నాడు, తన రుమాలుతో నాకండ్లని తుడుస్తూ.

'జట్కాబండి తీసుకురా' అన్నాను.

'ఎక్కడకని చెప్పను?'

'ఊరుబైటకి.'

ఊరుబైట పొలాలలోకినడిచి గడ్డివామిప్రక్కన కూర్చున్నాం జరిగిన సంగతులన్నీ చెప్పాను. మధు మాట్లాడకుండా దీనంగా కూర్చున్నాడు.

'మనం యిట్లా రావొచ్చునా... నీభర్తకి తెలిస్తే యెంతమోసం.' అన్నాడు.

'తప్పేమిటి? మధూ! అంతా యేకమై మనికి ద్రోహంచేశారు. దానికి యిల్లా మనం పగతీర్చుకోవాలని' అతని తలకాయుని నాతొడమీద ఆనించుకున్నాను.

'తెలిస్తే?' అన్నాడు.

'పారిపోదాం' అన్నా వెంట్రుకలను నావేళ్ళకి చుట్టుగుంటూ.

'ఎక్కడికని-? మనకి డబ్బేది?'

'మీయింటికే,-మీవాళ్లు యేమీ అనరుగా.'

'నాకు ధైర్యంలేదు. ఇక్కడనుంచి పోదాంపద.' అన్నాడు.

* * *

'అయ్యాయా, షికార్లు?' అన్నాడు నాభర్త.

'ఎందుకు అల్లా అడుగుతున్నారు?' అన్నాను. వెంటనే కాలేజీ

సంచికతీసి అందులో వొకపుటను చూపించి—

'ఈకాగితం తడిసిపోయిందే?' అన్నాడు.

'ఏమో—చాలా వింతగావుందే మీధోరణి' అన్నాను.

'నోరుముయ్' అని, నన్ను బెత్తంతో చాలాదెబ్బలు కొట్టాడు.

*   *   *

ఇట్లాగే చాలారోజులు గడిచాయి. నాసౌందర్యాన్ని అపహరించి నాకు అన్యాయంచేస్తున్నాడని నాకు లోపల పీకేదాకా వుంది కోపం. కాని నిజానికి నాభర్తకి నామీద చాలాప్రేమ నామీద యీగవాలనివ్వడు. నాటకాలను, సినీమాలకు, మీటింగులకు తీసికెడుతూ యేదికావాలంటే అది యిస్తూ ప్రాణంతో సమానంగా చూచేవాడు. విధిగా యితనికి చెందినా శారీరకంగాగాని, ఆధ్యాత్మికంగా కాని నేను యీయనకి చెందను. ప్రతి ఆదివారమూ, సాయంత్రం యేడుగంటలకు మధు మా యింటిముందునుంచి, నాకళ్ళకి వొక్కసారి కనపడాలన్న నియామకం మాకుంది. నాభర్త క్లబ్బునుంచి తొమ్మిదింటికికాని రాడు. ఇప్పటికప్పుడే పరిస్థితులు మారాయి. నాభర్తని, నాఅక్కయ్యని కలిపి చాలామంది అనుమానపడి, పాడులోకం చాలవదంతులేసింది. మాఅక్కనుచూసి యీర్ష్యపడకుండా యెల్లావుండగలదు యీ లోకం? అంత సౌరభాన్ని అంతా రూపాన్ని యెవరికీ అప్పగించకుండా దహనంచేస్తుందా? ఇందులో చాలామంది మా అక్కకోసం ప్రయత్నించి పొందలేక పోయినవారే, ద్రాక్షపళ్ళు పులుపైనా కొయ్యడం మానా్తరా?

మాఅక్కకు పిల్లాడు జనించిపోయాడనికూడా వదంతివుంది. అందుచేత మాఅక్క, మాఅమ్మ మళ్ళా మాస్వంతభవనంలోకి పోయి వొంటరిగా వుంటున్నారు. నేను నాభర్తతోనే వుంటున్నా. అది ఆదివారం.

'ఇవాళ ఆరుగంటలకి పాటకచ్చేరి—మనం తొందరగా వెళ్లాలి నువ్వు స్నానంచెయ్యి.' అన్నాడు నాభర్త.

'ఎవరు గాయకుడు?'

'ఎవరో అరవదేశస్థుడు. టిక్కట్లు వూరికేవొచ్చాయి మనకి పద' అన్నాడు.

'నాకు అరవసంగీతం యిష్టంలేదు. మీరు వెడుదురు' అన్నా.

'టిక్కట్లు వూరికే వొచ్చినప్పుడు...'

'ఐనా సరే—నాకు తలకాయనొప్పిగాకూడావుంది.'

'ఇవాళ మనపిల్లాడు పుట్టినరోజు అందుకోసమేనా వెళ్ళొద్దు?' అన్నాడు.

'పిల్లాడివొంట్లో బాగుండలేదు. మీరు వెడుదురు.' అన్నాను. ఆయన వెళ్ళిపోయారు.

నేను పిల్లాడిని యెత్తుకుని దొడ్డివెంపు గుమ్మంలో నిలబడ్డాను. మధుసూధనం అటుకేసి అనుకున్నప్రకారం వొచ్చాడు.

'చూశావా నాపిల్లాడిని? ఎవరిపోలికంటావ్?' అన్నా.

'ఏమో' అన్నాడు.

'కళ్ళు, నోరూ నీవి' అన్నా.

'చాల్లే నీహాస్యం—దీనికేంగాని నాచదువు నెలరోజుల్లో ముగుస్తుంది. నేను మళ్లా మావూరు వెళ్లిపోవాలి' అన్నాడు.

'నేకూడా, నీతోరానా?' అన్నాను.

'వొద్దు నీకింకా యేమీ తెలియదు. మనకి యెంతకాలమో అంతకాలమే ప్రాప్తి. నే మళ్లా కనపడను.' అన్నాడు.

ఇంతలో నాభర్త రావడం, దాసిపిల్లని నన్నుగురించి అడగడం అది. 'ఎవరో అబ్బాయితో మాట్లాడుతున్నారండి' అని చెప్పడం జరిగాయి.

'ఇందుకనా నువ్వు రానన్నావ్' అన్నాడు. నాకుకోపం ఆగలేదు. అందులో నేను, మధూ ఆఖరిసారి మాట్లాడుకుంటున్నాం. మా యెడబాటుప్రసంగాన్నికూడా పూర్తిగా సాగనియ్యనందుకు నాకు మింగివేద్దామన్నంత ఆగ్రహంవొచ్చింది.

'ఎవడువాడు — ఎన్నోవాడు' అని విషపునవ్వు నవ్వుతూ దండించి ప్రశ్నించాడు.

'మీబోటిగాడే వాడూను. నేను నిజంగా అతనికే చెందుతాను. మొదట్లో అతనికిచ్చి నన్ను వివాహంచేస్తామన్నారు. మేం చాలాస్నేహితులము. మీరు నన్ను బంధించి హింసిస్తున్నారు.' అన్నా యేడుస్తూ.

'అవుతే పిల్లాడుకూడానా...' అని యేదో అర్థంలేని వెఱ్ఱికేకపెట్టి మంచంమీద వాలిపోయారు, మూర్ఛవాడిలాగ అసలు నాభర్తకి గుండెజబ్బు, ఉబ్బసంవున్నాయని వైద్యులు చెప్పారు. ఈవార్త వినేప్పటికి ఆయన యేమీ చెయ్యలేక మతితప్పి పడిపోయారు. నేను చాలా విచారించాను. నేనీవార్త చెప్పకపోయినా ఆయన సంతోషంగా వుందురేమో!

నేను వీధులోకివెళ్ళి మధుని కేకేసాను.

'మధూ! ఆయనికి చెప్పేసాను. మంచంమీద పడిపోయాడు—డాక్టర్ని తీసుకురా, తొందరగా' అన్నాను. వైద్యుడు చెయ్యిచూసి, యేమీ భయంలేదని మందిచ్చి వెళ్ళిపోయాడు.

వీధిగదిలో నేనూ మధూ మాట్లాడుకుంటూనే వున్నాం.

'పాపం మనస్సు చెదిరిపోయింది—నేనంటే, యెంతో యిదిగా చూసేవాడు... ఆయనికి దగ్గ ఉండి సేవచెయ్యొద్దు? ఇంట్లో యెవ్వరూ లేరు కూడాను' అన్నాను.

'అవును పాపం- నువ్వు జాగ్రత్తగా, ఆయన్ని కనిపెట్టుకుని వుండు—నేను వెడతా, మళ్ళాకనిపించను' అన్నాడు.

'మధూ...' అన్నా మెల్లిగా.

'ఎందుకూ?'

'ఏమీలేదు.' ఏదో చెప్పలేక పొయ్యాను.

'మధూ, నువ్వు పెండ్లిచేసుకుంటావా?'

'ఏమో.'

'చేసుకోవొద్దు, మధూ! ఇంతకాలం వోపికపట్టినవాడవు యింకా కొంతకాలం వోపికపట్టు— తప్పకుండా దైవం మనని కలిపి తీరుతాడు.' అన్నాను. నాకేసి చూడకుండానే వెళ్ళిపోయాడు.

* * *

నాలుగైదు నెలలు భర్తకి సేవ చెయ్యడంలోనే గడిచిపోయాయి. రాత్రి ఆంధ్రపత్రిక తీసి ఆయనకోసం చదవడం, తలకి అమృతాంజనం మర్దనాచెయ్యడం, కాళ్ళు పట్టడం, గంటగంటకీ ఓవల్టీన్ కాచియివ్వడం—యిది నేచేసేపని.

పత్రిక చదువుతున్నా.

'భార్గవీ.' అని పిల్చారు నాభర్త.

'ఎందుకండీ' అన్నా. నాచేతిని తీసుగుని తన పెదవులకు తగిల్చారు. నేను యివతలకి తీసుగుని ముక్కుమీద వేలు పెట్టాను.

'మీ వొంట్లో యింకా బాగుండలేదు, చాలానీరసంగా వున్నారు' అన్నాను.

'పోనీ—నాలుగు ద్రాక్షపండ్లు తెప్పించు బజారునుంచి' అన్నారు. దాసీది తెచ్చింది.

'ఎట్లావున్నాయి.' అన్నాను.

'పుల్లగావున్నాయి' అన్నారు.

'కాదు మీనోటిచేదు— చాలా

తియ్యగావున్నాయండి. ఇది చూడండి' అని నేనే నోట్లో పెట్టాను.

'ఇది బాగుంది' అని నీరసంగా భూతాకృతితో నవ్వారు.

* * *

ఇట్లాగే ఆసంవత్సరం గడిచిపోయింది. మధ్య కొన్ని రోజులు కొంచెం తగ్గినా మళ్ళీ దగ్గు తీవ్రంగా రావడం సాగించింది. అర్థరాత్రి నేను పత్రిక విశేషాలు చదివిచెపుతున్నాను.

'ఇదొద్దు భగవద్గీత చదువు' అన్నారు.

'ఎందుకు— రేపు చదువుతాను'

'కాదు భార్గవీ! నువ్వు నా అంత్యకాలంలో చాలా బాగా సంరక్షణచేశావు. నీఋణం తీర్చుకోలేను.'

'అల్లాఅనకండి— మీరు నాయందు చూపిన ఓర్పు, దయ— వీటికంటె ఇది యెక్కువదికాదు' అన్నా.

ఆయనమాట సన్నగిలింది.

'నువ్వు, నువ్వు మనసార కోరిన వారిని చేసుకో— ఈకోరిక చెల్లిస్తేనే నాఆత్మకు శాంతి. నీకు నేచేసింది యేమీలేదు. తుదకు పిల్లాడుకూడా నా...'

మళ్ళీ మాటలేదు చాలాసేపు యేడ్చాను. నాభర్తమనస్సును వొక్క విషయంలో ఖేదపెట్టానని నాబెంగ. ఆయన కడసారివాక్కులు పూర్తిగాలేవు. 'తుదకు పిల్లాడుకూడా...' తనకు పుట్టలేదన్న అనుమానం వెలిబుచ్చాలన్న ప్రయత్నమా? అల్లాగయితే నేవిచారించదగ్గసంగతే. పోయేముందు వొక్కసారి, పిల్లాడు ఆయనకే జన్మించాడని నమ్మేటట్టు చెపితే యెంత బాగుండివుండును. అన్నింటిని మించిన యీ అనుమానంవల్ల ఆయన యెంత ఖేదించారో పాపం! నేను ఆయనకు నిజంగా చెందినదాననని ఆయన నమ్మితే యీ అనుమానానికి అవకాశం వుండకపోను. అన్నివిధాల నాపిల్లాడు భర్తసొత్తే.

* * *

మళ్లా యేడాదికి నాపిల్లాడు కూడా తండ్రిని వెదకడంకోసం అన్నట్లు కాలంచేసాడు. అంతవరకు నాకు మధుకి వుత్తరం వ్రాయడానికి మనస్సు వొప్పిందికాదు. పిల్లాడు గతించడంతోనే నామీద నాభర్తమోపిన నేరం బరువు తొలిగినట్లుగా వున్నాయి.

ఈబెంగ చల్లారగానే మధుని గురించిన విచారం యెక్కువైంది. అతను నాకోసం యింతకాలం వోపిక పట్టగలడా? ఈపాటికి అతనికి వివాహం జరిగేవుంటే? నన్ను మరిచిపోయాడేమో? ఆఖరికి ఉత్తరం వ్రాశాను.

పదిరోజులలోనే జబాబు వొచ్చింది.

'నెలరోజులలోనే నేను ఉద్యోగంలో ప్రవేశించవలసి వుంటుంది. ఇంతవరకు నీకోసం వేచివున్నందుకు భగవంతుడు అనుగ్రహం చూపించాడు.....

మళ్లా సన్నాయిమోత మేంత్రాలగానం వినిపించాయి.

౬

ఆరాత్రి ద్రాక్షపండ్లను తెచ్చి మా అక్కయ్యకు యిచ్చాను.

'ఎట్లావున్నాయి?' అన్నాను.

'ఎవరు తెచ్చారు?' అంది.

'మన మధుసూధనం' అన్నా గర్వంగా.

'ఎప్పుడు తెచ్చినా పుల్లవి తెస్తాడేం' అంది.

నాకు చాలాకోపంవొచ్చింది. ఏప్రయత్నాలు చెయ్యకుండా గుడ్డిగా నిద్రపోతున్న భగవంతుడిని నమ్మి భర్తఫోటోని పూజిస్తూ, తన సౌందర్యాన్ని నిర్మూలంచేసుకున్న మాఅక్కకి మధులోని మాధుర్యం యెట్లా తెలుస్తుంది? ఈ ద్రాక్షపండ్లతీపి నాకు యెక్కువ అయినకొద్దీ మాఅక్కకు పులుపు యెక్కువ అవుతుంది.

ఈకథను ఆదర్శప్రాయంగా అంగీకరించమని కోరడంకోసంకాని నాలాగే ప్రవర్తించమని భోదించడానికికాని వ్రాయలేదు. నాయందు సానుభూతి చూపేవాళ్ళుంటే ఆనందిస్తాను. అల్లాకాక నన్ను దూషించి కఠినంగా విమర్శించినవారందరు, అందని ద్రాక్షపండ్లను రాళ్ళతోకొట్టి వాటిని గాయపర్చడమేకాకుండా వృక్షాన్ని సహితం నాశనంచేసినవా రవుతారు.




## విరహి

కవి : మొక్కపాటి కృష్ణమూర్తి.
సాహిత్యసేవాపీఠము, పవరుపేట, ఏలూరు.
వెల : పావలా.

శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి శరీరంలోను, హృదయంలోను యౌవనరక్తం ప్రవహించే కుమారచిత్రకారుడు. యౌవనంయొక్క నునివెచ్చని ఉత్సాహం, ఆనందం, సౌందర్యపిపాస, జీవనం, ప్రేమ, విరహం, వేదన, ఆశ, స్వప్నం—ఇది యీతని చిత్రరచనల్లో నేను విరివిగా చూశాను. కవితాస్వరూప మివ్వబడ్డ యీతని భావనాజగత్తులో సహజంగా నే డివే ప్రతిబింబిస్తున్నాయి.

జీవితము సుఖానుభవమైనప్పుడు యీతడు చిత్రరచన గడగుతాడు.

"జీవితము సుఖమయమయి చెలగునపుడు
హృదయమర్మానుభవముల రగులుకొలిపి,
వింతరంగుల వెలయింతు వివిధగతుల
చిత్తరువుల సీతాకోకచిలుకపగిది!"

జీవితము మరిదుఃఖ విహ్వలమైనప్పుడు కవి తాను 'విపుల గగనాంతము' లోని కెగసి జాలిజాలిగా ఆక్రోశిస్తాడు :—

"జీవితము విషాదాంతమై చేదువడిన
చెవ్వుమని కేకవెట్టి నే కెరలిపోయి
విపులగగనాంతమున విలవిలవిషాద
గీతివెట్టు నభాగ్యకపోతివోలె!"

... ... ...

"విరహి" అను నీ చిన్నికావ్యంలో విరహబాధాభరితములైన గీతాలే విస్తారంగా కనిపిస్తున్నాయి. ఆవిరహం అవివాహితప్రేమికుల అపరీక్షిత విద్యుదౌజ్వల్యంకాక, అనుభవంచే, అవగాహనచే లోతెక్కి నిలుకడచెందియు, సంక్షోభింపచేసే పరిణతశరశ్చంద్రికలలోని ప్రగాఢదాహం. సత్యప్రేమగల వివాహజీవనం యెంతసుందరమై అరుదైనది! అందుచేతనే, అక్కడ సమస్తదేవతలూ, ఋషులూ వుంటారనీ, లక్ష్మి, సరస్వతీ అక్కడకాపురముంటారనీ, స్మృతికారుడు పరవశుడై గానంచేశాడు. అందులోనూ నేటి మనశుష్కిత సమాజజీవనంలో అది యెంత అపురూపమై, అరుదైన వస్తువు! కావుననే, జీవితంలోవలెనే సారస్వతంలో ఏరఘువంశంలోనో, మేఘసందేశంలోనో, ఉత్తరరామచరిత్రలోనో, యెంకిపాటల్లోనో అరుదుగా అది కనిపిస్తే మనం సహర్షంగా అంజలిచేస్తాము. ఈ చిన్ని 'విరహి' లోకూడా అట్టిజ్యోతిప్రసారమేమనకు కనిపించడం చాలాముదావహం.

... ... ...

'విరహము' శాస్త్రకారులచే నిట్లు నిర్వచింపబడియున్నది:—

"విరహోనామలబ్ధసంయోగయో
ర్నాయికా నాయికయోః కేనచిత్కార
ణేన పునస్సమాగమకాలాతిక్షేపః"
—ప్రతాపరుద్రీయము.

"కలసి యెడబాయ హృదయో
త్కలిక......"
—కావ్యాలంకారసంగ్రహము.

కాని యీతని విరహమున్నదే, అది కేవలము యెడబాటులోనే కాక, కలసి దగ్గరగా వున్నప్పుడుకూడ అతితరముగా ప్రజ్వలిస్తోనే వుంటుంది, అదే బాధతో, తీవ్రతతో ఒంటరిగాచిక్కిన ప్రియురాలితో హృదయదారణమైన ఆతనిసొద వెళ్ళబోసికొంటున్నాడు :—

*    *    *
*    *    *

"ఇటుల సంక్షోభితంబయి యెగసి యెగసి,
పగిలిపోవునె నాగుండె ప్రాణసఖియ!
ఇంత చలియించు నా పేదయెడద నెట్లు
హృదయమునఁజేర్చి కాపాడుకొందు చెలియ!"

ఆతని నాయిక ప్రౌఢయా, ముగ్ధయాశి ఏమో తెలియదు.

[మిగతా ౨౧౩-వ పేజీలో.

# ప్రకృతి ఒడిలో

"ఆయన ఏటిగట్టు ఇంజనీరుగారు, ఆయనభార్య. వారిమోటారుపైకి లుకకునే నడ్డమగుటచే నన్నీడ్చివైచిరి. నేను చెవిటివాడనో, పిచ్చివాడనోయని యూహించి కాబోలును దొరగారు తిట్టారు, దొరసానిగారు హేళనములు ప్రసాదించారు."

రచయిత :

## తురగా వెంకటరామయ్య

ప్రియమైన బావకు,

'నా వ్యవహారకాండమంతయు నీ నడుమ దారుమారగుటచే నాల్గు నెలలనుండియు మీ యూరనే కాలక్షేపము జేయుచుంటిని గాని నేడేలకో నా మనస్సంతయుఁ గలతనొందుటచే నుపశాంతికై నా యాత్మసీమ కేగితిని. ఆ కుగ్రామమునందే; తిరిగిన వీధినే తిరుగుచు మాట్లాడినచోటనే మాట్లాడుచు ఉదయమునుండి మధ్యాహ్నమువరకును వెఱ్ఱినై దిరిగితిని.

నా కబుర్లపటాటోపమునుబట్టియు, వేషభాషలనుబట్టియు నేనొక ప్రయోజకుడననియే కొందరు వయోవృద్ధులు నన్నుఁ బ్రశంసించిరి గాని నా దివాలాకోరుతనము నా గుండెలను లోపల నమిలివేయుచునే యున్నది. పయికిమాత్రమేమియు గనుపడనీయలేదు.

నా తలిదండ్రులు నా శైశవావస్థయందే గతించినను బుత్రప్రేమచే నాదరించి పెంచిన పినతల్లి ఇంకను జీవించియుండుటచే భోజన మామెయే పెట్టినది. పాప మామె ప్రేమ అనిర్వాచ్యము; తాను పెంచినప్పటికంటె నేను చిక్కిపోయినందుల కామె కడుదుఃఖించినది. మీరు వడ్డించుకోనందుకు కోపముకూడా వచ్చినది. నా యుద్యోగమునుగురించియు, కోడలి పనిపాటలనుగురించియు, మనుమరాంద్ర ఆటపాటలను గురించియు ప్రశ్న పరంపరలను గ్రుమ్మరించినది. కాని నా హృదయవేదనాభారముచే తగు సమాధానములఁ జెప్పలేక 'ఊఁ' అనియో, 'ఊహూఁ' అనియో మౌనమునే వహించితిని. ఒక్కసంగతిమాత్ర మామె తీవ్రముగ చెప్పినది.

'అబ్బాయీ! శారదాబిల్లు వచ్చిందట ప్రపంచమంతా అట్టుడికిపోతోంది. రెండోపిల్లకు నీయిష్టమువచ్చినట్టు చేసుకోవచ్చు. నేనప్పటికి బ్రతుకనే బ్రతుకను; పెద్దదానికి యెనిమిదేళ్లు వచ్చాయి గనుక ఈయేడు పెళ్ళిచేయక తప్పదు. నీకు తలిదండ్రులు లేరని స్వతంత్రించవద్దు. నేనింకా బ్రతికున్నా''నని నవరసస్ఫూర్తిగా మందలించింది.

నాకేమీ తోచలేదు ఇపుడు చేయనని ఖండితముగ చెప్పిన చిన్నబోవును. చేయుదునన్నచో వెంటనే చేయుమని నిర్బంధించును. కావున అదే ఆలోచించుచున్నాను. కట్నములతో ప్రపంచము తగులబడిపోవుచున్నది. బోలెడు డబ్బు కావలెను. అదీగాక ఏదో వచ్చిందని తొందరపడి ఎవనికో ముడిబెట్టితిమా బ్రతికినంతకాల మా పిల్ల దుఃఖించును. మంచి సంబంధము కొరకే చూచుచుంటి'నని లౌక్యముగ తప్పించుకొంటిని.

నేను వచ్చినపనియొకటి, జరుగుచున్నది ఇంకొకటి. ఈప్రసంగము నాకు రుచించునా?

ఇంతలో సాయంకాలమైనది. ఎండ చల్లారినది కాని నా హృదయాంతర్యాతవేదనాగ్ని చల్లారలేదు. నా జీవితమునకు పరమావధియని నమ్మినమార్గము నానాటికి దూరమగుచుండుటచే జీవించుటే హేయమనిపించుచున్నది; తలవని తలంపుగఁ గష్టములు పైబడుచునే యున్నవి. శోకములు బంధించుచునే యున్నవి; లోకములు బెదరించుచునే యున్నవి; నా ఆశయము క్షీణించుటలేదు. మార్గము దొరుకుటలేదు. స్వీయప్రజ్ఞపై నమ్మకము పోయినది; అన్ని పనులు వదలుకొంటిని. ఈస్థితిలో నాకేమి ప్రపంచము? ఒక్క నిట్టూర్పుతో బయలుదేరితిని*; అరటితోటలో నడచితినో, కొబ్బరితోటలలో దిరిగితినో, వరిపొలాలగట్టులయందు పడి లేచితినో ఏమియు నాకు దెలియలేదు. ఒక్కొకమారు కన్నీటి దొంతరలు మార్గావరోధము చేయుచుండెను. ఒక్కొకతరి సంతోషముతో మైలోక మంగయుచుండెను.

ఈనిమ్నోన్నతావస్థలలో గోదావరి తీరమునకు జేరితిని. బాల్యమున నేనాడుకొనినచోటులన్నియు నొక్కమారు న

న్నాదరించినవి మాజనయిత్రి 'గోదావరి' విమలవాయుడోలికలో నూగించి కోకిలకంఠియయి జోలలుబాడినది. పసిబాలుడనై నోట వ్రేలుంచుకొని ప్రకృతిలో నాడితిని. నాతో ఆడుకొనుటకే కాబోలు నెలబాలుడుకూడ నమృతసుందరుడై దయచేసెను. ధనశూన్యుడైన మహాదాత చందమున నేటికి జీవనరహితయయి బయలుపడినదయ్యో గోదావరీతరంగిణి తన చిన్నికెరటములతోడనే కళాపూర్ణు నాహ్వానించుచున్నవి. ఇసుకతిన్నెలు వెండిబంగారు రాసులవలె మెఱయుచున్నవి; చివురించిన మామిడితోటలు పురంధ్రీరమణులై కనుల పండువు సేయుచున్నవి; వర్ణించు టెందులకు? సృష్టికి నూత్నశోభ వచ్చినది: కల్యాణమందిరమైనది; అవిలాసముచూచి తీరవలెను; ఒక వైపున భగవన్నిర్మితయగు జీవనాహీనియు, రెండవ వైపున మానవశక్తినిర్మితమగు కాలువయు నడుమ నున్నతమగు నేటిగట్టును, ఆగట్టుపై సుఖదుఃఖ వివేచనామగ్నుడనై, కర్తవ్యతామూఢుడనైయున్న నేను, నాయున్మత్తతకు నవ్వుచు నెదుటఁ జలతరంగిణితో దాండవించే చంద్రుడు. ఏమిదృశ్యమోయి? నాచిత్తస్థితులకు భంగము కలిగించుట కేమానవవ్యక్తియు నాదాపునలేకుండుటయు నాభాగ్యమే; కొంతదూరమున నేటినడుమనున్న లంకలో జొన్నకళ్ళముల కాపలాకాయు వాతడు కాబోలు నీదృశ్యమున దన్మయుడై 'నీకూ నీవారూ లేరు—నాకూ నావారూ లేరు- ఏటియొడ్డున మేడగడదాం పదరా-! యని తీవ్రముగ పాడుచున్నాడు. కాలువలో పోవు పడవలోనివాడై యుండనోపు ఎవరో జిజ్ఞాసువు 'అంతా రామమయ మ్మీజగ-మంతా రామమయ? మ్మని శ్రావ్యముగ బాడుచున్నాడు. పడవను లాగువాండ్రా పాటకు ముక్వాలకర్రలతో లయవేయుచున్నారు. తన్మయుడనై వినుచు నేయున్నాను.

బావా! ఏమిచెప్పను? చింతాసముద్రములో మునిగియున్న నామనోమందిరమునఁ దళుక్కున నొక విద్యుజ్జ్యోతి వెలిగినది. ఆ ఆనందమునకు మేరలేదు వెనుకముందు నాఅన్నవారు లేరు. మన మాయేటియొడ్డున మేడగట్టుదము. అదియే మన పరమావధియని ప్రేమైకస్వరముతో నన్ను పిలిచినవారెవరు? ఎవరు? అని యరచుచు కన్నులుదెరచితిని; ఎవరును లేరు? పరమశాంతస్వరూపిణియుఁ గల్యాణినియు నగు ప్రకృతియున్నది. మణిభూషణాలంకృతయయి, చంద్రికాదుకూలధారిణియయి, జలజనేత్రయయి, కోకిలకంఠియయి నాయెదుటఁదాండవించుచున్నది. ప్రేమగానముల బాడుచున్నది. రసోపాసకుడనగు నాయాత్మ నాకు తోచినది. ఈజీవితమే దివ్యతరంగిణి. సౌధము నిర్మింపుము నీవు పాటకుడవైతివా నేను నర్తకినై తాండవింతును. నీవు కవివగుదువా నేను కళనై వెలింగెదను. నీవు యోగివగుదువా నేను సాధననై విజృంభింతును. నీవు ఈశ్వరుడవైతివా నేను శక్తినై నీలో కరగిపోదును. అవినాభావములగు మనతత్వములు విడినవి. వేరైనవి. పరిభ్రమణము నొందుచున్నవి. పడిపోవుచున్నవి. నన్ను లాలింపుము; ప్రేమింపుము; ఆత్మానుసంధాన మొనర్పుము. రసబ్రహ్మము నుపాసింపుము. జగద్రూపిణినగు నన్ను నీలోగలుపుకొని రసస్వరూపుడవుగమ్ము. జగత్తంతయు నీమయమై వెలుంగును. అంతా రామమయమ్మని పాడుకొగలవని యేమో యుపన్యసించుచున్నది. నేను తన్మయుడనై సర్వము మరచి నిలుచుంటిని.

ఇంతలో హఠాత్తుగా నెవరో నన్ను జెబ్బదొరకబుచ్చుకొని గట్టుక్రిందికీడ్చుట నేను కలతనిద్రలో మేలుకొన్నవానివలె చూచుసరికి ఒక మోటారుసైకిలులో నిరువురు స్త్రీపురుషులు ఆంగ్లేయులు ప్రత్యక్షమైనారు. కారణము దెలిసిపోయినది. ఆయన ఏటిగట్టు ఇంజనీరుగారు, ఆయన భార్య. వారి మోటారుసైకిలునకు నేనడ్డమగుటచే నన్నీడ్చివైచిరి. నేను చెవిటివాడనో, పిచ్చివాడనోయని యూహించి కాబోలును దొరగారు తిట్టారు, దొరసానిగారు హేళనములు ప్రసాదించిరి. ఊఁ జీవనములే క్షణభంగురములు; ఉద్యోగములును, విద్యుచ్ఛకటములును శాశ్వతములా? యని నేను నవ్వుకొంటిని.

రేపటినుండి యెటులుండునోగాని నేడుమాత్రము కోటీశ్వరునకున్నంత సంతోషమున్నది. నాలో ప్రకృతియు' ప్రకృతిలో నేనును కలిసిపోయినాము. ఈ ఆనంద మెంతకాలముండునో చెప్పజాలను. ఏమయిననేమి? నిర్మలానంద మొకక్షణము జాలదా? నీవు వేలకొలది ధనమును వ్యయపరచి ఆమలబారుతీరమున చదువుచుంటివి. ఆపరీక్షలగువరకు మాత్రము తత్వవిచారములో దిగకుము. "పట్టా" వచ్చినతర్వాత వ్యాజ్యములు వచ్చేవరకు గొన్నియేండ్లు "ఖాళీ"గానుండువుగాన తత్వవిచారమో మఱియొకటియో జేసుకొనవచ్చును. నేడింతకంటె నేమియు వ్రాయజాలను. క్షమింపుము.

నీ బావ

ఆనందుడు.

‘నన్ను బహిష్కరించిన ఆసంఘమే నన్ను చాటుమాటున పోషించింది.’

# మొగమహారాజులు

‘‘నన్ను పాడుచేయాలని చూచిన పాపిష్టి లోకమే నన్ను వ్యభిచారిణి, భోగంది అని పిలిచింది. ఉపన్యాసాల్లోనూ, పుస్తకాల్లోనూ నన్ను దూషించినవాళ్లే నన్ను రహస్యంగా పొగడేవారు.’’

రచయిత:

మద్దాల తాతాజీరావు

౧

మొన్న వేసవికాలంలో చిన్న పని మీద పట్టణం వెళ్లేను. సాయంకాలం అయిదుగంటలు పైనే కావస్తుంది. ఇంకా గాడ్పు కొడుతూనేవుంది. బీచి వైపుకు షికారుగ బయలుదేరేను. ఏదో ఆలోచిస్తూ చాలదూరం నడిచిపోయాను. కొంతసేపటికి దాహం వేసింది. దగ్గరలో యెక్కడా షోడాషాపు కనబడలేదు. పోనీ, మంచినీళ్ళయినా తాగుదామని దగ్గరగఉన్న యింటికి వెళ్లేను. అదొక చిన్న బంగళా. లోపల గుమ్మందగ్గర ఒకావిడ కూర్చుంది. వయస్సు మళ్ళింది కాని ముసలావిడకాదు. ‘‘ఏమమ్మా, కొంచెం మంచినీళ్లు దొరుకుతాయా?’’ అన్నాను గొంతుక తడుముతూ. ‘‘అదెంతభాగ్యం, నాయనా!’’అని అరుగు మీదఉన్న కుర్చీలో కూర్చోమని చెప్పి మంచినీళ్లు తెచ్చియిచ్చింది. ‘ఈమహాపట్టణంలో యింత ఆదరంగా చూస్తున్న యీావిడ యెవరా’ అనుకున్నాను. వెంటనే వెళ్ళిపోతే బాగుండదు.

రెండుముక్కలు మాట్లాడిపోదామని ‘‘మీకాపురస్థలం ఏ వూరండీ?’’ అన్నాను.

‘‘చాలదూరంవుంది, నాయనా! మాదొక పల్లెటూరు’’ అందావిడ.

‘‘మీరొక్కరేవుంటున్నట్టున్నారే యీయింట్లోను’’ అన్నాను.

‘‘అవును. నాయనా! నేను ఒక్కదాన్నే. ఏంచెప్పను? నాదొక అభాగ్య జీవితం. తలుచుకుంటే గుండె తరుక్కుపోతుంది’’ అంది పాపం యెంతో దీనంగా.

సంభాషణ మొదలెట్టినందు కూరికే పోలేదనుకుని ‘‘అవునమ్మా, కష్టాలు అందరికీ కలుగుతాయి. మనబాధలు యితరులకు చెప్పుకుంటే హృదయభారం కూడా తగ్గుతుంది. నీజీవితగాధ వినాలనుంది నాకు’’ అన్నాను.

ఆవిడ చెప్పటం మొదలుపెట్టింది:

‘‘అయిదేళ్లు కాపురంచేసిన తర్వాత నాభర్త చనిపోయాడు. అప్పటికి నాకు యిరవై రెండో, యిరవై మూడో ఉంటాయి. మాపుట్టింటివాళ్లెవరూ లేకపోవడంచేత అత్తవారింటిదగ్గరే ఉండిపోయాను. మామగారు, నాతోడికోడలు, నేను ఉండేవాళ్ళం ఒకయింట్లో. వాళ్లు నన్ను మొదటినుండీ వాళ్ళింట్లో దాసీదానిలాగ చూడటం మొదలెట్టారు. రోజంతా చచ్చిచెడి పనిచేసేదాన్ని. కుక్కకంటే నీచంగా చూసేవారంటే నమ్ము,నాయనా! ఓపికతో రెండు సంవత్సరాలు భరించాను. ఇంక ఆయింట్లో ఉండటం దుర్లభమైపోయింది.

ఒకరోజున తెగించి మాతోడికోడలుతో ‘‘అక్కయ్యా! నేను వచ్చిందగ్గర నుండి మీకూ సుఖంలేదు. నాకూ సుఖం లేదు. నాకేదన్నా వేరే యేర్పాటుచేస్తే బాగుంటుం’’ దన్నాను.

ఎక్కడ విన్నాడో మాబావగారొచ్చి ‘‘ఏంటి యేర్పాటుచేసేది, పడుపువృత్తి చేసుకోరాదూ, కావలసినంత డబ్బు’’ అన్నాడు.

ఆమాటలు వినగానే నామీద పిడుగు పడినట్లయింది. వాళ్లెంత కష్టపెట్టినా, ఆయనంటే నాకు కొంచెం గౌరవముండేది. దాంతో నాకు అసహ్యంవేసింది. తెగించి నాభర్తకు రావలసినభాగం ప

చిపెట్టమని అడిగాను. వెంటనే నన్ను వీధిలోకి గెంటేశారు.

ఆవీధిలోగాని, ఆవూళ్లోగాని నాతరఫున మాట్లాడేవారే లేకపోయారు. దిక్కులేనిదాన్ని వీధిలోకి గెంటేస్తే పెద్దలందరు తమకు తెలియనట్లుగానే ఊరుకున్నారు.

“అయితే కోర్టులో దావా చెయ్యక పోయారే” అన్నాను.

“అయ్యో! పిచ్చివాయనా! డబ్బున్నవాళ్ళకి కోర్టులూ, న్యాయంగాని, దమ్మిడీలేని నాకు కోర్టులో న్యాయం దొరుకుతుందా? సరే, ఆవేళే ఆవూరువదలి రాత్రంతా ఊరుబయటనే గడిపాను. తిండిలేదు, ఆకలి దహించేస్తుంది. ఎందులోనన్నా పడి చచ్చిపోదామనుకున్నాను. కాని ధైర్యంచాలిందికాదు. అడుక్కొని బ్రదుకుదామా అంటే నీచమనిపించింది. కష్టపడి జీవనోపాధి గడింపడం గౌరవమేకాని మానహీనం కాదనుకున్నాను.

## 2

ఎవరింట్లోనన్నా పనిచేసి బ్రదుకుదామనుకుని, దగ్గరగా ఉన్నపట్టణంవెళ్ళి ఒక డాక్టరిగారింట్లో పనిచేసేందుకు కుదిరాను. భోజనంపెట్టి నెలకు 10 రూపాయిలు యివ్వడానికి యేర్పాటయింది. డాక్టరుగారి పిల్లల్ని చూడటం, వంట చెయ్యడం యిదీ నాపని. కొన్నిమాసాలయిన తర్వాత డాక్టరుగారిభార్య పురుటికి పుట్టింటి కెళ్ళింది. డాక్టరుగారికి నామీద కామంకలిగింది. నన్ను బలవంత పెట్టేడు. నేను తిరస్కరించాను. ప్రాణంకన్నా మానంయెక్కువగా చూసుకునేదాన్ని. అమర్నాడే నన్ను పనిమానిపించేశారు, ఆడాక్టరు మహాశయులు. మళ్ళీ పొట్టచేత్తో పట్టుకుని తిరగటం ప్రారంభించాను పనికోసం.

## 3

ఆపట్టణంలోనే ఒక పెద్ద మిల్లు ఉంది. మేనేజరుగారిదగ్గరకెళ్ళి మిల్లులో పని ఇప్పించమని అడగ్గానే ఆయన ఒప్పుకున్నాడు. ఒక వారంరోజులు పని చేసేను. కర్మవశాత్తూ ఆ మేనేజరుకు కూడా నామీద కామప్రవృత్తి కలిగింది. ఆయనకోర్కెకు సమ్మతిస్తే నేను మిల్లులో పనిచేయవలసిన అవసరం ఉండదనీ, యెంతో సుఖపెడతాననీ ఆశలుపెట్టాడు. సమ్మతించకపోతే మిల్లులో పనిచేయటానికి వీలులేదని కూడా చెప్పాడు. అమరునాడే ఆమిల్లువదిలేశాను.

“నాకు ప్రపంచంమీద అసహ్యం కలిగింది. నీతికి న్యాయానికి తావులేదనిపించింది. నాశరీరాన్ని, యౌవనాన్ని ఆశించేవాళ్ళేగాని, నాసేవను లెక్కచేసేవాళ్లు లేరనుకున్నాను. మగవాళ్ళ దౌర్జన్యం యిలావుందికదా అనిపించింది. నాకొక మొండిధైర్యం కలిగింది. మగవాళ్ళకు తగిన ప్రతీకారం చేయాలనుకున్నాను.

తిన్నగా ఈ పట్టణంవచ్చి 'వ్యభిచారవృత్తి ప్రారంభించేను. నాకు కావలసినంత డబ్బువచ్చేది. అపుడే యీ బంగళా కట్టించాను. నన్ను పాడుచేయాలనిచూసిన పాపిష్టిలోకమే నన్ను వ్యభిచారిణి, భోగంది అని పిలిచింది. ఆ సంఘమే నన్ను బహిష్కరించి, నీచంగాచూసి, చాటుమాటున నన్ను పోషించింది. ఉపన్యాసాల్లోను, పుస్తకాల్లోను నన్ను దూషించినవాళ్ళే నన్ను రహస్యంగా పొగడేవారు. సంఘ ధర్మకర్తలు, నీతి నియమాలకు అవతారాలు అనబడే పెద్ద, పెద్దలే నాకు పాదాక్రాంతు లయ్యారు.

మగజాతిమీద పగతీర్చుకున్నానన్న సంతుష్టికలిగింది నాకు. నాజీవితానికి కావలసిన ధనం ఉంచుకొని, మిగిలింది బీదసాదలకు దానంచేశాను. నేను చచ్చిపోయేముందు ఈబంగళా వితంతుశరణాలయంవారికి దానంచేస్తాను. ఇది, నాయనా! నావిషాద గాథ. పాపం, చాల సేపుకూర్చుని ఓపికతో విన్నావు” అందావిడ యెంతో దయతో.

“అయితే, నీదుఃఖజీవితానికి ఎవరు సిగ్గుపడాలంటావు” అన్నాను యేమి చెపుతుందో అని.

“మొగమహారాజులందరూ” అంది మొగవాళ్ళని జయించానన్నగర్వంతో.

# మరణించి బ్రతికిన మదాలస

[౧౮౮-వ పేజీ తరువాయి.]

కాను; గంధర్వుడను కాను; కిన్నరుడను కాను. అట్టివారిని ఎల్లవేళల కొలుచుచుండు మానవమాత్రుడను- మహారాజు శత్రుజితు నా పితృదేవుడు. వారి ఆజ్ఞ తలనిడుకొని మునిజనుల కాచు నిమిత్తము గాలవాశ్రమమునకు వచ్చితిని. అచ్చటికి ఒక రాక్షసుడు పందిరూపముతో వచ్చినాడు. అర్ధచంద్ర మను బాణముతో వానిని వేసితిని. ఆదెబ్బకు వాడు భయపడి పలాయితుడైనాడు. గుఱ్ఱమును తోలుకొనుచు నేను వాని వెనువెంట వచ్చితిని. వచ్చివచ్చి వాడు ఒక భూగృహమున దిగబడినాడు కటికచీకటులతో కారుకొనియున్న అభూగృహమున నేనునుదిగి వాని కొఱకు వెదికితిని. కాని వాడు అగుపడలేదు. రాగారాగా నాకు తేజోవిరాజితమగు ఈనిర్జననగరము కనిపించినది. ఇందు తిరుగుచుండగా నీవు అగపడితివి. పలుకరించి నను నీవు పలుకలేదు. అంతట నీవు ఎక్కివచ్చిన ఈ మేడమీదకు నేనును వచ్చితిని.''

మదాలస హర్షము, లజ్జ, విస్మయముకుదిరిన చూపులతో, నచ్చిన ప్రేమతో ఋతధ్వజుని వదనము చూచుచు ఆతడు చెప్పినదంతయు వినినది. మిన్నంది ఆమె చెలికత్తెతో ఇట్లన్నది. 'కుండలా! దయపెంపున సురభి చెప్పినదంతయు ఇట్లు నిజమై సమకూరినది. దైవలీల ఇట్లుండగా తప్పించుట ఎవ్వరితరము!'

౭

అప్పుడు కుండల కువలయాశ్వునితో ఇట్లు పలికినది. 'రాజకుమారా! మాకు సురభి చెప్పిన మహానుభావుడవు నీవె. నిన్నుతప్ప మఱియొకరిని మదాలస వరింపనొల్లదు. పాతాళకేతుని బాణముతో కొట్టగల సాహసికుడు విక్రమోజ్జ్వలుడు భూమిమీద నీవుగాక మఱి ఎవ్వరున్నారు? కావున సూర్యుని దీప్తియు, చంద్రుని కాంతియు, సుగుణాఢ్యుని సంపదయు పొందునట్లు నీవు ఈమెను పొందుము. విధిపూర్వకముగ వివాహము చేసికొనుము.' అందుమీద రాజకుమారుడు ఎలనవ్వు మొగమును అలంకరింపగా 'అట్లే అగుగాక' అనెను.

అప్పుడు కుండల మదాలస పితృవంశమునకు హితపురోహితుడైన తుంబురుని తలచెను. తోడనే అతడువచ్చి ఉచితములగు మంగళాచారములు నడపెను. అగ్నిహోత్రము పెట్టి, విహితాగమ తంత్రము లాచరించి, మంత్రయుక్తమగు హోమముచేసి తుంబురుడు పరమోత్సవమున కువలయాశ్వునకును మదాలసకును పరిణయము చేసెను. అట్లు పెండ్లికార్యము నిర్వర్తించి తుంబురుడు తనతపోవనమునకు తరలిపోయెను.

తీర్థములకు పోవలయునను కుతూహలము తన్ను ప్రేరేపగా అనంతరము కుండల వినయావనతయై కువలయాశ్వునితో ఇట్లు చెప్పెను. 'రాజకుమారా! నీవు చతురుడవు, బుద్ధిమంతుడవు. ధర్మమూర్తివి. అట్టి నీకు పండితులయినను హితోపదేశము చేయలేరు. అట్టిచో స్త్రీ వ్యక్తిని నేను ఏమిచెప్పగలను? అయినను మాచెలికత్తెయగు మదాలసయందున్న మమకారము కొలదిని కొన్ని విషయములు చెప్పెదను. నీవును మదాలసయు వినవలసినది—భర్తయగువాడు భార్యను ప్రయత్నముతో భరింపవలయును. ఆమెకు ఎట్టికీడును రాకుండ రక్షింపవలయును. పతికి భార్యవలననే ధర్మార్థకామములు కలిగి అతిశయిల్లును. భార్యలేనివానికి వర్గత్రితయములో ఒక్కటియును లేదు. దేవపూజ, పితృపూజ, అతిథిపూజ మొదలగు విధులు నెరవేర్చుటకు భర్తకు భార్యయే ఉపాశ్రయము. మగడులేనిదానికి ధర్మము, ధనము, కామమును లభ్యముకావు. కావున దంపతులు పరస్పరవశతాప్రమోదమగ్నమానసులై కూడి జీవింపవలయును. కావున రాజకుమారా! నీవును

మదాలసయు ఇతరేతరానురక్తులై ఎంచరాని సంపద, ఎన్నదగిన సంతానము పొంది చిరకాలము వర్ధిల్లుడు.

ఇట్లు చెప్పి మదాలసను కౌగలించి వీడ్కొని రాజకుమారుని సెలవుపుచ్చుకొని కుండల ఆకాశ మార్గమున పోయెను.

౮

అనంతరము ధీరోదాత్తుడైన కువలయాశ్వుడును, మదాలసయు దివ్యాశ్వము నెక్కి పాతాళమును అతిక్రమించి వచ్చుచుండిరి. పాతాళకేతుడు తీసికొనివచ్చిన కన్యను ఋతధ్వజుడు నిశ్శంకముగ కొనిపోవుచుండుట కొందఱు రాక్షసులు చూచిరి. వెంటనే వారు ఈ వృత్తాంతము రాక్షసవిభునకు వినిపించిరి. ఇది వినుటతోడనే ఆతని నేత్రములు సంధ్యారుణము లయినవి. పండ్లు పటపటమని కొఱికినాడు. ఆతని వదనమున కోపము, ఓర్వలేనితనము వలన నెలకొన్నవి. ఆకారము భీషణమైనది. ఉజ్జ్వల వివిధాస్త్రశస్త్రసమితితో రాక్షససేనలు విక్రమించి ముందునడవగా పాతాళకేతుడు రాజకుమారుని పైకి వచ్చినాడు. ఋతధ్వజుడు చలింపలేదు. అదిచూచి పాతాళకేతుడు నిలునిలుమని నిష్ఠురనాదముతో అర్చినాడు. చుట్టుముట్టిన రాక్షసులపై ఋతధ్వజుడు వివిధములైన నిశితాస్త్రములు కురియించినాడు. రాక్షసులును తీవ్ర సాయకాసిగదాశూలతతులతో ఆతనిని కప్పిరి. అట్లు రాక్షసనాయకులు ఆతనిని లెక్కగొనక పొదవుచుండిరి. అప్పు డా రాజకుమారుడు అలతినగవుతోడి అలుక మోమున కొకవింత చెలువొనర్ప, రణోత్సాహము దీపింప గుణము సారించి, మార్గణము నిగిడించి రాక్షసుల సాయకాసిగదాశూల తతులు చిద్రుపలై పాతాళలోకమున పడునట్లు చేసెను. అసురవీరులమీద కువలయాశ్వుడు మఱి కొన్ని బాణములువైచెను. కపిల మునీశ్వరుని కోపాగ్నికి సాగరులు క్రాగిపోయినట్లు కువలయాశ్వుని బాణాగ్నికి పాతాళకేతుడు మున్నగురాక్షసులు ఎల్లరు దగ్ధులయిరి. ఇట్లు విజయలక్ష్మిని చేకొని కువలయాశ్వకుమారుడు మదాలసతో కూడి తన పురమునకు పోయెను.

౯

పోయి ప్రథమమున కువలయాశ్వుడు పితృదేవుని దర్శించినాడు, దర్శించి పరమభక్తితో ఆతని పాదములకు ప్రణమిల్లినాడు, ప్రణమిల్లి తాను పందిని పొడుచుట; దానివెంట పాతాళమునకు పోవుట; కుండలను చూచుట, మదాలసను పెండ్లి అగుట; పాతాళకేతుడు ఆదిగాగల్గు రాక్షసులను చంపుట విన్నవించెను. అది వినుసరికి శత్రుజితు శరీరము పులకితమైనది; నేత్రములు ప్రమదాశ్రుకణకలితములైనవి. తోడనే ఆ రాజు కుమారుని గ్రుచ్చి కౌగిలించుకొని ఇట్లు పలికెను: 'కుమారా! మునీశ్వరులు నిర్భయభావము పొందునట్లు రాక్షసులను సంహరించితివి. ధర్మము, కీర్తి, శౌర్యము, తేజము మిన్నుముట్టునట్లు చేసితివి. వంశము వెలుగునట్లుగా జగమున పేరుగంటివి. నీవంటి సుపుత్రుని కాంచుటవలన నేను కృతార్థుడనైతిని. నీచుడు, మధ్యముడు, ఉత్తముడు అని పుత్రులు మూడు విధములుగా ఉన్నారు. తండ్రి సద్గుణసముదయము క్రుంగుడువడ మెలగు పుత్రుడు నీచుడు. తండ్రి సంపాదించిన సంపద, కీర్తి, ప్రతాపము పొలివోవకుండ నిల్పుకొని వర్తించు తనయుడు మధ్యముడు. తండ్రి మహాత్మ్యము స్వశక్తిచేత పెంపొందించు నందనుడు ఉత్తముడు. ఎవడు స్వశక్తివలన కీర్తి కెక్కునో వాడు ఉత్తముడు. ఎవడు తాత, తండ్రి మొదలగువారి చేత వెలయునో వాడు మధ్యముడు. తల్లిచేతను, తల్లి బంధువర్గము చేతను వెలయువాడు అధముడు. ఇందు నీవు ఉత్తములలో చేరుదువు. ఏమనగా సునాయాసముగ పాతాళము చొచ్చితివి; బాహుబలమున రాక్షసుల సంహరించితివి; గంధర్వకాంతను తెచ్చితివి; ఇట్టి నీవు సామాన్యుడవా? ఏరాజులును నీకు సరిరారు. నీచేత మన వంశము పెంపువహించినది; నేను కీర్తికెక్కితిని. కులము వెలయిం

చిన నీవు ఆయువు, ఐశ్వర్యము, సంతానము గలిగి వర్ధిల్లుము.'

తండ్రిచేసిన లాలన ; ఇచ్చిన దీవన అందుకొని కువలయాశ్వుడు మదాలసతోకూడి అంతఃపురమునకుపోయి తల్లికి మ్రొక్కెను. ఎల్లవారికి ఆనందము కలుగజేయుచు అతడు సుఖముగానుండెను. మదాలసయు దినదినమును అత్తమామలకు అతిభక్తితో మ్రొక్కుచు ; చెప్పినపనులన్నియుచేసి వారిని మెప్పించుచు; మగనివలన అభిమత సుఖములు అనుభవించుచుండెను.

౧౦

ఇట్లుండగా ఒకనాడు శత్రుజితుడు పుత్రునితో ఇట్లు పలికెను. 'కుమారా ! పాపపు రాక్షసులు ఇంకను పలువురు ఉన్నారు. వారివలన ఎట్టి ఉపద్రవమును కలుగకుండ మునికోటిని కాపాడుట క్షత్రియులమగు మన ధర్మము. కావున మునీశ్వరరక్షణార్థము నీవు కువలయాశ్వమును ఎక్కి ప్రతిదినమును ప్రపంచమున సంచరింపుచుండుము.'

తండ్రిమాటపంపున కువలయాశ్వుడు కువలయాశ్వమును ఎక్కి అనుదినము పూర్వాహ్ణమున మునీశ్వరరక్షణార్థము భూమిఅంతయు కలయదిరిగి వచ్చుచుండెను. వచ్చి తండ్రికి మ్రొక్కుచుండెను. మ్రొక్కి మిగిలినకాలమంతయు మదాలసతో మనోహరవిహారములు సల్పుచుండెను. అనుదినమును ఈ విధమున చరియింపుచుండెను.

౧౧

పాతాళకేతునకు తాళకేతుడని ఒక తమ్ముడు ఉన్నాడు. అతడు తన అన్నను చంపిన ఋతధ్వజుని పై కసిపూనెను. ఆరాక్షసుడు తన మాయాబలమున యమునానదీతీరమున ఆశ్రమము కల్పించుకొని మునివేషముతో అందుండెను. తాపసకోటిని రక్షించుకొఱకు కువలయమును కలయతిరుగుచు ఒకనాడుకువలయాశ్వుడు తాళకేతుని ఆశ్రమముకడకు వచ్చెను. అప్పుడు వాడు ఆరాజకుమారునిచేరి ఇట్లు చెప్పెను. 'వీరకుమారా ! నిన్నొకటి వేడెదను. నేను యాగమొకటి చేయవలెనని చిరకాలము నుండి ముచ్చట పడుచున్నాను. తగిన దక్షిణకొఱకు నీదగ్గిరకువచ్చితిని. మన్నించి నీకంఠవిభూషణము నాకు ఒసగుము. అది గైకొని జలములయందు మునిగి సకలభూప్రజావృద్ధిహేతుకములైన వైదికవారుణమంత్రవిధులచే వరుణదేవుని అభిమంత్రితునిచేసి వత్తును. నేను వచ్చువఱకు నీవు ఇచ్చటనేయుండి రక్షారతిపూని ఏమఱక ఆశ్రమమును కాచుచుండుము.'

అందుమీద కువలయాశ్వుడు కపటమునికి మ్రొక్కి కంఠభూషణముఇచ్చెను. 'మునీశ్వరా! ఆశ్రమమును అరయుచుండెదను. నేను ఇచ్చటనుండగా విఘ్నముచేయుటకు ఒకనికి శక్యముకాదు. కావున పోయి విహితకృత్యము నెఱవేర్చుకొనిరమ్ము.' అని కువలయాశ్వుడు తాళకేతునితో అనెను.

అనిన కపటముని యమునాజలములందుమునిగి మాయాబలమున కువలయాశ్వుని పట్టణమునకు పోయి రాజమందిరము చొచ్చెను. శోకదైన్యములు ముసుగుపడిన మొగముతో మదాలసకడకు చని డగ్గుత్తికతో ఇట్లు పలికెను. 'కటకటా! ఏమిచెప్పుదును. నాఆశ్రమభూమిని కువలయాశ్వుడు పెంపెక్కిన విక్రమముతో మునీశ్వరుల రక్షించు దీక్షతోనుండెను. అప్పుడు ఒకరాక్షసుడు రౌద్రమునవచ్చి ఆతనిని తాకి, శూలముపుచ్చుకొని పొడిచెను. దానితో పాపము కువలయాశ్వుడు నేలకూలెను. అట్లుకూలి మరణవేళను తనకంఠమాలతీసి నాకిచ్చినాడు. ఇక దాచుట ఎందుకు? వినుము. అచ్చట ఉన్న శూద్రతాపసులు కొందరు అప్పుడు అతనికి అగ్నికార్యములు ఒనరించిరి. హేషారవము ఏడ్పుటెలుఁగు అగునట్లుగా అశ్రుజలపూరితాననమైన కువలయాశ్వరత్నమును ఆదురాత్ముడు గొనిపోయెను. తల్లీ ! ఏమి చెప్పుదును. నేనెంత పాపకర్ముడనో? కళ్ళముందఱ ఇంతయును జరుగగా చూడవలసిన దురదృష్టము నాకు పట్టినది. హృదయమునకు నమ్మకము పుట్టించు ఈభూషణము నీవే కైకొనుము. తపసికి నాకిది ఎందుకు?' అనుచు ఆకంఠ

భూషణము అచ్చటవైచి తాళకేతుడు వెళ్ళిపోయెను.

౧౨

ఆదుఃఖవార్తవిని ఎల్లవారును ఏడ్చుచు వివశులై పలవించిరి. రాణులును రాజును కుమారుని గుణములు పేర్కొనుచు ప్రలాపించిరి. కంఠభూషణమును అంది మదాలస ప్రాణవాయువులు దొరగి సుడిగాలి తాకునకు పుష్పలతవలె నేలగూలెను. ఈవిషాదవృత్తాంతమునకు రాజగృహమున ఎట్లు దురంతాక్రందనములు పుట్టినవో అట్లే పురజనుల గృహములందును ఏడ్పులు పుట్టెను. పతిమరణశోకతాపమున విగతప్రాణయై వజ్రాహతి కూలిన మణిశలాకవలె నేలబడిన మదాలసనుచూచి శత్రుజిత్తుమహారాజు మదిలో కొంచెము ధైర్యము అవలంబించి పరిజనులనుచూచి ఇట్లుపలికెను: 'సంసారము అధ్రువమైనది. ఎంచిచూచితిమేని అందు కలుగు సకలసంబంధములును అనిత్యములైనవి. కావున ఇట్లు రోదనముచేయుట వృథ. కృతకృత్యత్వమున విశ్రుతులైన కొడుకునకును, కోడలికిని విచారించుటతగవుకాదు. ఎట్లందురా? కువలయాశ్వుడు నామాట పాటించి మునీశ్వరరక్షణ నిత్యతత్పరుడై సమరాంగణమున వీరమరణముపొంది ఈ ఏహ్యపుదేహమును విడిచిన కృతార్థుడు; పుణ్యమూర్తి, మునులకొఱకు ప్రాణమువిడిచి తల్లిసతీత్వమును, కులము విమలత్వమును, తన భుజవీర్యమును వెలయించిన నాకుమారుని వీరచరిత్రము దుఃఖహేతువు కాదు. మగని మరణవార్త వినుచునే ప్రాణములువిడిచి పరలోకవాసియగు భర్తనుకూడబోయిన ఈసువ్రత విచిత్రచరిత్రము దుఃఖింపతగినదా? పతివినా స్త్రీలకు దైవము లేడుగదా! మగనికోల్పోయి మలమల మఱుఁగుచు మన ఇంటియందు ఈమె ఉండుటయే చూడ తటస్థించినచో మనకును, మన బంధువులకును ఒక్కనాఁడైన శోకవహ్ని ఆఱునెట్లు? పురుషవిహీనులయిన స్త్రీల దైన్యములకు అడలతగును. కాని పురుషానుమరణపుణ్యోత్తరయగు ఈసాధ్వికి వగవ పనిలేదు.''

శత్రుజిత్తు పలికిన పలుకులు ఆతనిదేవి విన్నది. పుత్రమరణకారణము తెలిసికొన్నది. ఆమెకు మిన్నుముట్టు సంతోషము కల్గినది. పతినిచూచి ఇట్లు పలికినది. ఆర్యా! మునికోటిని కావ పూని యుద్ధభూమియందు అస్త్రనిచయదారితాంగులయి మరణించు నిర్మలధర్మకర్ములే నరులు. కాని ఇంటియందు రోగములప్రమంది బంధువులు విలపింపగా చనిపోవు కష్టులు నరులుకారు. వారి తల్లులు తల్లులును కారు. ఎప్పుడు కుమారుడు వైరులను జయించుటగాని, యుద్ధభూమియందు మరణించుటగాని కల్గునో అప్పుడు స్త్రీకి గర్భదుఃఖము సఫలతపొందునని నా అభిప్రాయము-''

తరువాత శత్రుజిత్తు మదాలసను అలంకరించి ఉచితరీతిని పురము వెలుపలకు గొనిపోయెను. అచ్చట ఆమెకు అగ్నిసంస్కారము చేసెను. పిమ్మట స్నానముచేసి కొడుకునకును కోడలికిని ఉదకకర్మములు ఆచరించి ఇంటికివచ్చెను.

౧౩

అచ్చట యమునానదీతీరమున కువలయాశ్వుడు రక్షారతిపూని తాళకేతుని ఆశ్రమమును కాపాడుచుండెను. అప్పుడు కపటముని యమునాజలము వెలువడి కువలయాశ్వునికడకు వచ్చి ఇట్లు వచించెను. 'మహానుభావా! నీవలన కృతార్థుడనైతిని. కదలకుండ ఇచ్చటనే నీవు ఉండుటవలన నాకోరిక నెఱవేఱినది. ఇక దయచేయుము.'

అందుమీఁద ఆతనికి నమస్కరించి సెలవుపుచ్చుకొని రాజకుమారుడు మదాలసను చూచు వేడుకతో కువలయాశ్వము నెక్కి తన నగరమునకువచ్చెను. వచ్చి చూచునుకదా నగరమంతయు అలంకారశోభ దక్కియున్నది. అతనిరాకకు పౌరులెల్ల అద్భుతమును, అతిమోదమును పొందిరి. ఒండొరులను ఆలింగనము చేసికొనిరి. రాజకుమారుని దీవించుచు అతని వెనువెంట రాజమందిరమునకు పోయిరి. అచ్చట ఋతధ్వజునిచూచి తల్లిదండ్రులును, సకల బంధువులును అ

# చానమ్మ

బ్రహ్మతేజము, మహాక్షాత్రము నొక్కటఁ దనయందు చిక్కఁబట్టి పరశురామునివలె 'ఇదంబ్రాహ్మ్యమిదంక్షాత్ర' మ్మని చాటిచెప్పి యసహాయశూరుఁడై యొప్పిన తన పతి యొకప్పుడు విధివశముచేత స్వబలము చెల్లాచెదరు కాఁగా రణరంగమునం దొంటరిపాటున నిలువరాక వీరవిహారము విరమించి యింటికివచ్చుటఁ జూచి, అతనికి వీరసందేశమిచ్చి ప్రబోధితుఁజేసి సమరోన్ముఖుఁగావించి వీరస్వర్గమిప్పించిన వీరపత్ని చానమ్మ ధన్యచరిత్ర మాంధ్రలోకమునకు నందు ముఖ్యముగ నాంధ్రరమణీమణులకును బ్రాతస్స్మరణీయము గదా!

చానమ్మ తిక్కన యర్ధాంగి. వీరవిక్రమములు సెఱపి యాతఁడు 'ఖడ్గతిక్కన, రణతిక్కన' యను బిరుదు బీరములు వహించెను. తిక్కన కొట్టరువు సిద్ధయామాత్యుని జ్యేష్ఠ పుత్త్రుఁడు. విరాటపర్వముఁ దొట్టి తుదముట్ట నాంధ్రమహాభారతము 'నాంధ్రావళిమోదముంబోరయ', 'బుధసంతోషము నిండార' రచియించిన తిక్కనసోమయాజీతనికిఁ బినతండ్రి కుమారుఁడు. పదమూఁడవశతాబ్దియందు విక్రమసింహపురమున (నెల్లూరున) రాజ్యమేలిన మనుమసిద్ధిరాజునకు మంత్రిమణియై, సేనానియై రణతిక్కన వెలుఁగొందెను.

యాదవులకుఁ గాటమరాజు ప్రభువు. అతఁడు కనిగిరిసీమలోని యెఱ్ఱగడ్డపాడున కధిపతి. కనిగిరిసీమలో నొకప్పుడనావృష్టిదోషము సంభవించెను. పచ్చిక బీళ్ళన్నియు నెండియెడారులగుటచేఁ బశువులకు మేఁతకఱవైనది. అప్పుడు కాటమరాజును, యాదవులును దమ పసులమందలను మనుమసిద్ధిరాజు మేఁతబీళ్ళకుఁ దోలికొనివచ్చి పుల్లరినిచ్చు నొడంబడికపైని తోలకరించువఱకును మేపుకొనిరి. పశువులమేఁతయైనఁబిదప వారక్కడ తమకో దూడలలో నేదో నష్టము కల్గినదన్న నెపమునఁ బుల్లరి నెగవేసిరి. అందుపై మనుమసిద్ధిరాజు లమందల నటకాయించెను. అప్పుడు పోరు ఘోషఁగెను.

సిద్ధిరాజు గొప్పసైన్యమును సమకూర్చుకొని సమ సన్నాహములు సాగించెను. తిరునామాల తిప్పరాజు, శ్రీకం రాజు, పెదవేఁగి చొక్కరాజు, పెదవరదరాజు, అర్లకొం అచ్చిరాజు, ఆదివన్నె మాదిరాజు, గయికొండ గంగరాజు ఉర్లకొండ సోమన్న, ఉదయాద్రి ఉమ్మయ్య, చెన్నపట్ ణము చంద్రశేఖరుఁడు, దేవముని వెంగళయ్య, పట్టుకో బసవరాజు, కాళహస్తి పాపతిమ్మరాజు, వెలకంచి వెంగ పతిరాజు, ప్రభగిరి పట్టణము పద్మశేఖరుఁడు మున్నగ యోధులు మనుమసిద్ధిరాజునకు బాసటలై వచ్చినిలిచిరి. ఆ వీరులందఱకు ఖడ్గతిక్కన మొనగాఁడై జైత్రయాత్రక వెడలెను.

కాటమరాజుగూడ యుద్ధసన్నద్ధుఁడయ్యెను. పల్నా ప్రభువైన పద్మనాయఁడు, పల్లికొండప్రభువైన చల్ల పిన్నవ నాయఁడు, దొనకొండ అయితమరాజు, ఎఱ్ఱయ్య, పాచయ్య నాయఁడు, ముమ్మయ్యనాయ[illegible], పుత్తమరాజు మొదలగ యాదవవీరులు కాటమరాజునకుఁ దోడ్పడవచ్చిరి. ఈ సైన్య మున కంతయుఁ జిన్నమనాయని మంత్రియైన బ్రహ్మ రుద్రయ్యయను నారాధ్యబ్రాహ్మణుఁ డాధిపత్యమ వహించెను

ఉభయవాహినులును పాలేటియొడ్డునఁ బంచలింగా కొండకడ డాకొని తలపడియెను. అప్పుడు దొమ్మియుద్ధమ జరిగినది. అందు సిద్ధిరాజు సేనలు యాదవవీరులఁ బరాక్రమ ధాటికి నాగలేక వీఁగఁబాఱఁజొచ్చెను. సిద్ధిరాజు సేనా యగు ఖడ్గతిక్కన ధైర్యము చిటిలిపోయినది. ఇంతక మున్నెన్నడు ఖుసివోని అతని ఖడ్గధాటి మొద్దువాఱెను నిజబలములు చేవదొఱఁగి చెట్టాకపిట్టలై చెదరిపోఁగ నొంటరిపాటున యుద్ధభూమియందు నివ్వెఱపడి నిలి యున్న తిక్కన్నను దిలకించి ప్రతిపక్షయోధుఁడైన పిన్నవ నాయఁడు

'పోరునిలుపుమోయి భూసురోత్తముఁడ !
సరిగాదు మాతోడ సమరంబుసేయ
అగ్రజుల్ మీరు యాదవులము మేము
ఉగ్రముల్ మామీఁద నుంపంగరాదు.

—కాటమరాజుకథ.

అని అహమహమికతో నెత్తిపొడుపుమాట లాడెను. అపుడు తిక్కన్న చేయునదిలేక తన దురదృష్టమునకు దుర పిల్లుచు మఱల నింకొకప్పుడు సేనలఁగూర్చుకొనివచ్చి తలపడ వచ్చునని తలచి సంగ్రామరంగమునుండి గుఱ్ఱమును మఱలించుకొని పురమునకు వచ్చెను.

వైరికి వెన్నిచ్చివచ్చిన తిక్కన్నను జూచి విక్రమసింహపురవాసు లీసడింపు పలుకులాడి వికావిక నవ్విరి. అవును, నవ్వరా ? అయినింటఁబుట్టి కానిపని చేసినచో నవ్వరా ? పుట్టినది శౌర్యమునకు విశ్రామభూమియగు కొట్టరువువారి వంశమున; పూనినది అసాధారణము, నన్యదుస్సాధమునైన వాహినీపతిత్వము; చేపట్టినది కఠోరఖడ్గము; వహించినది 'రణతిక్కన'యను వీరబిరుదము. అట్టిచో పగఱకు వెన్నిచ్చినయెడల నవ్వులపాలు గాకుండునా ?

ఇట్టి యీసడింపువాక్యము లాతని కింటియందు విస్తరించి వినిపించినవి. కడుపు చెఱుపఁబుట్టిన ఈబరిగొట్టని సిద్ధయామాత్యుఁడు కొమారుని యుల్లము చ్చిపోనాడెను. తిక్కన స్నానమాడఁబోవ నాఁడువారు జలకమాడు మఱుఁగుపట్టున భార్య చానమ్మ నలకమంచ మడ్డుపెట్టి దానిపైఁ బసుపుండనుంచి నీళ్ళబిందెఁ దెచ్చిపెట్టెను. 'ఇదియే'మని వ్యసనపడి యాతఁడడుగఁగా చానమ్మ

క॥ పగఱకు వెన్నిచ్చినచో
నగరే నిను మగతనంపు నాయకులెందున్ ?
ముగురాఁడువార మైతిమి ;
పగపేటికి జలకమాడ వచ్చినచోటన్ ॥

—చాటుధార.

అని ముదలకించి సూటిపోటు మాటలాడెను. ఇన్నాళ్ళదనుకఁ దలలో నాలికవలె ననుకూలవతియైయుండిన అర్ధాంగి నేఁ డిట్లు బెడిదురాలై యుండుట గమనించి యాతఁడు భోజనమునకు లేచెను. తల్లి ప్రోలమ్మ యన్నములో విఱిగిన పెరుగు పోసెను- 'ఇదియే' మని యాతఁడనఁగా నామె త్రుంచి వైచినట్లు

క॥ అసదృశముగ నరివీరుల
మసిపుచ్చక విఱిగివచ్చు మగపంద క్రియన్
గసవున్ మేయఁగఁబోయిన
పసులున్ విఱిగినవి, తిక్క ! పాలున్విఱిగెన్ ॥

—చాటుధార.

అని తుటారించి తూలనాడెను.

చేసికొన్న భార్య యట్లు చెంగనాడెను. కడుపారఁ గన్నతల్లి యిట్లు త్రుంచివైచెను. అంతతో నాతనికి ఉక్కుకోపమువచ్చినది. నిప్పుకణములవంటివారి పోటుమాటలు వైరుల శరవర్షమునఁ జల్లారిన అతని శౌర్యమును లేవంజోపి రవులఁబెట్టినవి. చిరకాలసముపార్జితమైన వంశప్రతిష్ఠ రూపొందిన యప్పుడు తిక్కసేనాని నిట్లని హెచ్చరించెను.

సీ॥ విజయాధిపుని దాడి వెనువెంటఁదగిలిన
బ్రాణముల్ దాచిన పందగజము !
పెంపేది పాలేట బిరుదులన్నియువైచి
పరుగెత్తివచ్చిన పారుఁబోత !
దురములోఁ జావక దొరలెల్ల హసియింప
మంచాన కోరిగిన కొంచెకాఁడ !
చతురంగబలముతో సమరంబుసేయక
మానంబు విడిచిన మందబుద్ధి !
గీ॥ యనుచు నార్వేలవారు నిన్నపహసింప
ధరణి నెల్లూరిలో నెట్లు తిరుగఁగలవు ?
వైరులనుగెల్చి సత్కీర్తి వఱలుమయ్య !
మంత్రికులహేళి ! తిక్కనామాత్యమౌళి !

—చాటుధార.

అంతట తిక్కన్న తినుచున్న యన్నము విడిచిలేచి వెంటనే గుఱ్ఱమునెక్కి యుద్ధభూమి కుఱాయించెను. అయితే ఇపు డాతనికి జయసంపాదనము ప్రధానప్రసక్తి గాదు. కొట్టరువువారి వీరవంశమునకుఁ దనమూలమునవచ్చిన

మచ్చు దుడిచి వేయవలయుననియే ఆతని ప్రస్తుతదీక్ష. ప్రాణములకుఁ దెగించిన పరశురాముఁడు ఖడ్గముతోఁ గదనరంగమునఁ జొఱఁబడెను.

తిక్కదండనాథాగ్రణి ఖడ్గధాటికి మాఱులేకుండెను-వచ్చినవాఁడు ఫల్గునుఁడని యాదవవీరులు బెదరిరి; పరిభ్రమించిరి. సమరాంగణమున రణతిక్కన పచరించిన యుద్ధక్రమమును జరిత్రకారుఁ డిట్లభివర్ణించుచున్నాఁడు.

చ॥ పడటున వాజిరాహుతులపై దుమికించుచుఁ
దిక్కఁడార్చినన్
బెదిరి పరిభ్రమించి కడుఁ బిమ్మట వీరులు
భీతచిత్తులై
యదెయదె వాలు వాల్మెఱుఁగు లల్లవె అల్ల
దె యంతఁడంచనన్
గొదుకక యాజిఁజేసె రిపుకోటుల కండఱ
కన్నిరూపులై.
—చాటుధార.

ప్రతియొవ్వరునులేక వీరవిహారము సల్పుచున్న ఖడ్గతిక్కన్నను గని యాదవులసేనాని బ్రహ్మరుద్రయ్య ముందునకువచ్చెను. ఆవిప్రవరుల కిరువురకును జాలసేపు ద్వంద్వయుద్ధము జరిగినది. తుదకిద్దఱును నేలకొఱగిరి. అప్పుడు క్షాత్రమిళితమైన బ్రాహ్మణ్యము రక్తప్రవంతులతోఁ బ్రవహించినది.

ఇట్లు మొక్కలోని అసహాయసాహసుఁడై విక్రమపౌరుషాదుల వెలిపి వీరస్వర్గమును జూఱలాడి

ఉ॥ చిక్కక మన్మసిద్ధివిభుచే మునుగొన్న ఋణం
బుదీర్చె మా
తిక్కనమంత్రి సోమశిలదేవరసాక్షిగఁ బెన్న
సాక్షిగా
నెక్కిన వాజిసాక్షిగ మహోన్నతికెక్కిన
కీర్తి సాక్షిగా
స్రుక్కక మారుకొన్న రణశూరులు సాక్షి
గఁ గొండసాక్షిగన్.
—చాటుధార.

తనపతి వీరశయన మలంకరించిన శుభవర్తమాన మాలించి వీరపత్ని చానమ్మ నిశ్చింతతో సహగమనము చేసినది.

సమరధర్మము వీసరఁ బుచ్చివచ్చిన ఖడ్గతిక్కన్నకు వీరసందేశమిచ్చి రణమునకుఁబంపి యాతనికి వీరస్వర్గ సుఖమిప్పించి యాతఁ డపయశఃకూపమునఁ బడకుండఁ గాపాడిన కీర్తి వనితాశిరోమణియగు చానమ్మది. పతి కెదురాడనోడి చానమ్మ మూగయైయుండినచో 'ఖడ్గతిక్కన, రణతిక్కన' యని జనామోదమునొందియున్న పతిబిరుదు బీరములఁ బెడిసకొట్టియుండును; యశోభరితమగు కొట్టరువువారి వంశము దుర్యశఃపంకమున బ్రుంగుడువడియుండును; ప్రోలమాంబ వీరమాతయగుటకు బదులు భీరుమాతయైయుండును; విశేషించి తాను వీరపత్నియనిపించుకొనుటకు వీలులేకుండయుండును. ప్రమాదించిన పతికి విధ్యుక్త వీరధర్మము జ్ఞప్తికిఁ దెచ్చి పరువుమర్యాదలు నిలిపి చానమ్మ వీరపత్ని యనిపించుకొనినది. కావుననే చానమ్మ కీర్తి ప్రబంధమును నాఁటి నుండి నేటివఱకుఁ దెనుఁగువారు పునశ్చరణ చేయుచున్నారు పుట్టినింటికి మెట్టినయింటికిఁ బరువు ప్రతిష్ఠలు సంపాదించి తన ధన్యచరిత్రముచే మాతృభూమిని పునీతమొనర్పఁగలిగిన చానమ్మవంటి స్త్రీరత్నమును దమలో నొకతెగాఁబడయఁగలిగినందుల కాంధ్రస్త్రీలోకము గర్వింపవలసియున్నది.

అభిమానవతియైన అంగన ప్రాణనాయకుఁడు పిఱికివాఁడగుట భరింపలేదు. అట్లగుటలేకదా, జోధపురాధీశ్వరుఁడైన జస్వంతసింగు మహాజహానుపక్షమూని ఔరంగజేబుపై నెత్తివెళ్ళి యుద్ధమున గాయపడి యోడి పురమునకు రాఁగా మానవతియైన జోధపురరాణి పురద్వారము బిడాయించి 'పరాజితుని దీనాననము నీపురస్త్రీలకుఁ జూపనక్కఱలే'దని కచ్చితముగఁ గబురుచేసెను. అయితే, జోధపురరాణివలె చానమ్మ కఠోరతవూనలేదు. మాటలతోడనే మనోరథ మీడేర్చుకొన్నది. ప్రమాదవశమునఁ బెడమార్గము ద్రొక్కిన పతులకు సరియైన మార్గమును జూపుటలో రమణీమణులు చానమ్మ చారిత్రమును మేలుబంతిగ జేకొనియెదరుగాక !

వీరపత్నియయిన చానమ్మ విశ్రుతకీర్తికి విపులమగు నాంధ్రావనియంతయు విహారమందిరమై వెలయుచున్నది.

[౨౦౦-వ పేజీ తరువాయి.]

"ప్రేమ తేజమెరుంగని ప్రోడు పెడద
నంటబెట్టితివే ప్రణయాగ్నికీల !
ఇప్పు డిదిమహాజ్వాల, దహించివేయు.
ప్రేమసీ, చూతువేల, అమాయికముగ?"

* * *
* * *

"అపరిచితమైన ప్రేమయాత్రాపథాల
భయమువాపిన నీవెంటపయనమైతి,
కంటకితమైన పథమిది కాంచియిపుడు
తెల్లబోయెద వేలనే, తెరువులేద?"

ఈక్రింది పద్యములలో నెట్టి ఆరాధన, కళాహృదయం, చిత్రణమూ వున్నాయి !

"స్నిగ్ధభవదీయ శైత్యసంశ్లేషమునకు
గ్రాగిపోయిన నామనోరథములెల్ల
నేడనుభవింతు; తడియూరు నీదుకురులు
ముడువకేచెలి, విరబోసియుండనిమ్ము !
"నీవినీలంపుకైశికా నిభృతశీత
లోర్మిలోదవిన సుఖమయస్పర్శలాను
దుర్భరనివాసమున వేగి తూలునెడద
నిరతి బాష్పసంపిహిత కపోలయుగళి !"
"కంటకావిష్టమై కనుపట్టు శయ్య
విరహసంబోధనినాళ్ళు విలులితమయి,
నీతనూలతదవిలి నేడినిశీధి
కురుల మెత్తల హాయిగా కూర్కుగందు!"

ఆ 'యిల్లాలి యెడబాటు'లో, కలయికలో, అనుభవములో 'లౌకికముకాని ప్రేమవల్లరులు' వున్నాయి.

"తనివియెరుగని యీజీవితంపు తృషను"—
అన్నది యీకావ్యములోని వొక గొప్పగీతము.

... ... ...

ప్రేమ,విరహమూ మాట అటుండనిచ్చినచో—'గభీర నిశీథములో తేలివచ్చే 'విషాదవేణురావానికి స్పందించే హృదయం;- ఒకమారు 'హృదయమునదాగియుండిన అగ్నికొండ పగిలినప్పుడు' సాగరఘోషలో నుపశాంతి నభిలషించే ఏకాకి ; స్వార్థపంకిలవిశ్వంలో నలిగిపోయిన పూల్రబదుకులకై' పరితపించే మనస్వి ; వేరొకప్పుడు కారణం తెలియని విషాదగీతాలను విలాపించే కవి—వీరు మనకు కనిపిస్తో వుంటారు.

... ... ...

ఇకనాకు తోచినలోపాలూ, కొన్ని సూచనలూ వీనితో యీ 'సమీక్ష' ముగిస్తాను. (1) ఈతనిభాష; పరిభాష (టెక్నిక్) యింకా యెక్కువ పరిణతి పొందాలి. (2) అనవసరమైన ఛందోభంగాలులేక రచన 'అదోషముగా'వుంటే మంచిదని నాయభిప్రాయము. (3) కొన్నిచోటుల ఈతని ప్రేమోచ్చారణ భౌతికవిషయవాతావరణానికి విశేషంగా పైకెగయుటలేదు.

భావౌన్నత్యమును సూచించే లక్షణము లిందు సమృద్ధిగావున్నాయి. సక్రమపరిణతిని పొందిన యీతని లేఖిని యితోధికప్రేమ చిత్రణలనూ, కవితారచనలనూ లోకానికి అందిస్తుందిగాకయని కోరుతున్నాను.

*

## పాలపుంత

కర్త: అత్తిలి సూర్యనారాయణమూర్తిగారు.
రవీంద్రసారస్వతసమాజము,
భీమవరము, పశ్చిమగోదావరి.

ఈ పద్యకావ్యం చదివి ముగించిన పిదప కవియొక్క రచనారీతిలోని కొన్ని సులక్షణాలు సునిశితంగా మనకు అవగతమవుతాయి. వానిని యీక్రింద నిర్వచించి, అవసరమైనచోట క్లుప్తమైన వుదాహరణలిస్తాను :—

1. స్వాతంత్ర్యం:—ఇది యీకవిరచనయం దంతటా వెల్లివిరిసి, వ్యాపించియున్న ప్రధానలక్షణం. అందుచే దీనికి వేరువుదాహరణ లిచ్చుట అనవసరము. ఉత్సాహాతిశయం చేత ఇరుగట్లతోను విరోధించి, అలజడిపడే స్రోతస్వినివలె యీతడు భాషలోనూ, ఛందస్సులోనూ సుస్థాపిత పూర్వ నియమాలపై తిరుగుబాటుచెయ్యడాని కెంతమాత్రం సంకోచించడు.

పైవిషయంతో బహుశా అనుబంధితమై, అతిశయమైన వుత్సాహం, జీవనం యితని రచనఅంతటా కనిపిస్తుంది.

2. సంగీతం:—'నాదనామక్రియా', 'తోడి', 'ముఖారి' యీపదములయొక్క. ఉచ్చారణనుబట్టి కాదు కాని ;

‹బాపిబావ'కు అంకితంచేసిన గీతంలో, ‹పెంపుప్రేమ'లో, ‹నారాయణదాసు'లో—ఈ మొదలగువానిలో యీ లక్షణం బాగా కనిపిస్తోంది.

3. నాటకీయత్వము:—ఇవి అన్నిటికిన్నీ యీకవియం దుద్యోతకమయ్యే ఆశాజనకమైన గొప్ప లక్షణంగా నాకు కనిపిస్తోంది. సక్రమవికాసాన్ని పొందితే, పొందించుకొంటే, యిందులో ఈతని కవితాభావియొక్క ఔన్నత్యపథం నాకు స్పష్టంగా గోచరిస్తోంది. కొన్నితావుల్లో ఈతడు ‹బ్రౌనింగు' కవియొక్క ‹నాటకీయాత్మసంభాషణలు' (డ్రెమాటిక్ మేనాలగ్సు) తరచుగా స్మరింపజేస్తాడు:—

శతవృద్ధుఠాకూరు ‹ఆబూ' కొండపై చిగురించిన ప్రకృతిలో, ‹కని' గా పాడే కోయిలతో, బొమ్ముడితో వాదు చేస్తాడు :—

''యుగాలే ఊగిపోయాయ్ !
ఎగతాళా పూలుపరచేవ్ !

* * *
* * *

''ఉరమకు నీ పాడుగొంతు
మొదకువోయె నేమి నేడు
చరవకు వెన్నదిమి గంధ
సారపూత చేతిగాలి
''నకనకలాడే మాకీ
నవ్యరాగ శ్రీలేటికి
యుగాలైందే నాడో
ఊఁ, ఏమనుకొన్నావోవ్ !''

—''నల్లజెండా''

* * *

‹ప్రవాసి' యన్న గీతమిందులకు మరియొక చక్కని వుదాహరణం. అందుండి 1, 2 పద్యాలుమాత్రం వుదహరిస్తాను.

* * *

''మాట ! ఉండుండు ; విధివిరామమ్ములేక
ఎగయజిమ్మకు, జలకేళు లింకజాలు
నీవునావంక నేర్పుమై నెట్టుజలము
తరగనిచయమ్ము నావచ్చి తరుమునన్ను.

* * *

''తిరుగ చనుదెంచుదాక నీతీరమందె
నిలుతునన్నావు. చెప్పకో సులువురేల
బయటివారలు వినకుండ ప్రణయకథల ;
నీకు పెరలీడుకాడు రత్నాకరుండు.''

* * *

నడయంత్రంలోకూడా యీచాయలున్నాయి.

4. జానపదగీతాలు :—‹పెంపుప్రేమ' 'ఉదయగొబ్బి'—ఇట్టి కొన్నిటిలో ఈధోరణి కనిపిస్తుంది. ‹గోగీతి' నుండి వుదాహృతమైన యీక్రింది పాటలో పల్లెటూరి ప్రశాంతి పటంవుకది :—

''శాంతిశాంతిని వెలుగు, జలజలా చేలపై
వాలి కంకులజొచ్చి, పంటసిరి రూపొందె

* * *

చేలపై, దారిపై, చెట్లపై, నింగిపై
ఆ ప్రశాంతపువేళ, అలమింది ఆపాట

* * *

... ... ...

దేశం, కవిత, తెలుగుతనం మొదలగువాటినిగురించిన యీతని అభిప్రాయలతోకూడిన గీతాలువున్నాయి. ‹నేతి... నేతి:' ‹సత్య' ‹వెలుగు' ‹బాపిబావ' ‹నారాయణదాసు' యివి యందలి కొన్ని మంచిపద్యాలు. ‹అనుమానం' లోని ప్రతిమ గొప్పది.

''అది పెనుభూతం ! దానికళ్ళు
పచ్చన, దానిమొహం ఎర్రన
దానిహృదయం నల్లన
దానికి ఆత్మలేదు !

* * *

ఈక్రింది భావన గొప్పది :—

''మహాగ్రీష్మానికి మగ్గినా మాలతి
మందపవమానానికి తలఊపుతోనేవుంది.''

* * *

'పీఠిక'ను శ్రీశివశంకరశాస్త్రిగారు ఇట్లు ముగించారు :—

‹.కావలసినంత కవితాశక్తి మనసులోనున్నవాడు. అది అంతా పైకిరావలెనని నాకోరిక !''

నేనూ యీసహృదయవాక్యములయందలి భావము నే హృదయపూర్వకంగా అనువదిస్తో యీ ‹సమీక్ష'ను ముగిస్తాను.

—కస్తూరి రాజామాణిక్యమ్మ, బి.ఎ.

# నా ఫిలిం అనుభవములు

[౧౮౦-వ పేజీ తరువాయి]

ముగా తీయించాలని నిశ్చయించుకున్నారు శ్రీరాంబాబు, బలరామమూర్తి గార్లు. అందుమీద వీరికి పరమమిత్రులు, మాకు లోగడ ప్రోత్సాహమిచ్చిన అడ్వకేటుగారు నన్ను వెంటనే రావలశినదిగా వుత్తరము వ్రాశారు. ఈ కాలేజీగరల్ చార్జి వాయిదా సందర్భంలో వుండిపోవడంవల్ల వెంటనే బయలుదేరలేక పోయాను. తిరుగ వైరుయిచ్చారు, ఆ వైరుమీద రాజమండ్రి నుంచి పట్నంవచ్చాను. అందరంకలసి పీపుల్సుబ్యాంకుదగ్గరకు వెళ్లాము. మా న్యూకాలేజిగరల్‌ను ఫిలింగాతీయుటకు నిశ్చయించుకుని కంట్రాక్టువగైరా అంతా ఆదినముననే పూర్తిచేయించారు. ఆమరుచటిదినం బయలుదేరి ఆర్టిస్టులను బుక్కుచేయుటకు బయలుదేరాము. ఒక మాసందినములలోపునే అందరనూ బుక్కుచేసి, సినోరియో వగైరా అంతయు సిద్ధముచేసి సెట్టింగులు వగైరా అన్నియు సిద్ధముచేసుకొనుటకు వీలుగావుంటుందని ఎంచి, ముందుగా కొచ్చర్లకోట రంగారావు గారిని కొంతమంది ఆర్టిస్టులను పంపించాను. మాకు మధ్యవర్తిగావుండి సెటల్ చేశిన అడ్వకేటుగారే, యీ యిండియన్ ఆర్టుసినీటోన్ తరపున తీయబోవు యీ కాలేజీగరల్ చిత్రమునకు అన్ని విషయముల మేనేజిమెంటు చేయుటకు సర్వాధికారిగా నియమింపబడ్డారు, మేము ఏమి చేసినా ప్రతిదీ వారి అనుమతిని జరగాలి. రంగారావుగారిచే పంపించిన సినోరియో జనరల్ మేనేజరు గారు చూచారు. వారికి నచ్చక యింకా ఎలక్షన్లనీ, కట్నములేని పెళ్ళి అనీ, ఏవేవో చేర్పించి కలగాపులగంచేయించి సినోరియో తయారు చేయించారు.

నేను రాగానే మా రంగారావు గారు అది చూపించారు. నాకు ఏమిటో గందరగోళంగా కనుపించి ఆ అడ్వకేటుగారిని అడుగుతే ఆ రెండుఐయిటమ్ములు వుండకతప్పదన్నారు. నాకు ఏమీ తోచక డైలాగువగైరా వ్రాయింపించిన శ్రీ వేదులవారికి వైరుయిచ్చాను. వారూ వచ్చారు. ముగ్గురము కలసి ఎంత మాటలాడినా అవన్నీ వుండాలనివారు, ఆరకంలోవుంటే నాపేరు పాడు అవుతుంది నేను వ్రాయను మీరు వేరే యింకొకరిచేత వ్రాయించుకోండని వేదులవారు, యీమోస్తరుగా తర్జనబర్జనలు అయిన తరువాత కట్నాల అయిటం మాత్రం తప్పించి ఎలక్షన్ల అయిటం మాత్రం వుంచుటకు వుభయులను రాజీ చేసి వొప్పించాను. ఆక్రొత్తఅయిటం వొకటి అందు జేర్చడంవల్ల అంతా క్రొత్తది వ్రాయాలసి వొచ్చింది. కథయొక్క రూపంకూడా మారిపోయింది. అందువలన కాలేజిగరల్ తీసివేసి ప్రేమవిజయం అనే పేరుపెట్టవలశివచ్చినది. ఈ గందరగోళాలన్నియు పూర్తి అయ్యేసరికి ఆవిజయసినీటోన్ సేతుబంధనం ఏమీ అవకపోవడం ఆ డైరక్టరు రాజారావు నాయుడుగారు ట్రస్టీలు తగాయిదాలు పడటం రాత్రిరాత్రి ఆరాజారావునాయుడుగారిని వారి ట్రూపును స్టూడియోలోనుంచి అవతలకు పంపడం ఆవిజయసినీటోన్‌కు అంత్యక్రియలన్నీ చేయడం యీ గందరగోళాలన్నీ వొకమాసంపట్టింది. ఆ తరువాత కెమిరారికార్డింగు ట్రిక్కుల తాలూకు కంట్రాక్టుటయిము వొక మాసమే మిగిలింది. ఆటయిములోపునే మా షూటింగు అయిపోవాలన్నారు, సరే మేము చురుకుగానే పనిప్రారంభించాము. ప్రింటుచేసిన ఫిలిమును చూచుకొనుటకు ఒకప్రొజక్టరు మేడమీద బిగించారు.

అందు యీ ఫిలిం వేశి చూచిన సౌండు ఏమియు బాగుండుటలేదు, అందులోనూ పాటలు మరింత అధ్వాన్నముగా నుండేవి. అక్కడికీ వొక్కొక్క పాట మూడేసిసార్లుకూడా రీటేకు చేయించాము. ఒకసారికన్న మరొకసారి మరింత అధ్వాన్నంగా తయారయ్యేది, ఏమిటండీ సౌండు యిల్లావుందేమని వారు నియమించిన టెక్నికల్ డైరక్టరు ద్వారకనాధుగారిని అడుగుతే, హాలు రీసౌండు యిస్తూంది అందువల్ల అల్లావుందిగాని బొంబాయికాపీలు ప్రింటు అయివచ్చి పెద్దహాల్సులో వేస్తే బాగానే వుంటుంది లేండి అనేవారు. మా జనరల్ మేనేజరు గారిని అడుగుతే వారూ ఆ పాఠమే వప్పగించేవారు.

ఇహ ట్రస్టీలా యిదేకాదు. మరియితరవిషయములు ఏమిచెప్పినాసరే మాకేం తెలియదు అంతయుం జనరల్ మేనేజరుగారియిష్టమే అనేవారు. సరే ఏమి తెలియని వారితో సంబంధము కలుగజేసుకోవడం నేరం మనదేనని వూరకునేవారం మేము. మాసంటయిములోనే షూటింగు పూర్తి అయినది. రైల్వేచార్జీలు మినహా అంతయూయిచ్చి ఆర్టిస్టులను పంపించివేశారు. కవిగారికి యివ్వవలసినబాలెన్సు ఆర్టిస్టుల రైలుఖర్చులు కొన్ని మాసములు త్రిప్పిన తరువాత యిచ్చారు. అసల్లో వారికీనాకు జరిగిన కంట్రాక్టుప్రకారం నాకు రావలి

శినఖర్చులు వగైరాలు యింతా కొన్ని మాసములు పోయినతరువాత శ్రీవాడరేవు వియ్యన్నపంతులు గారిచే నోటీసు యిప్పించి గందరగోళం జరిగిన తరువాత ఏదో తునితగవుగా పరిష్కారంచేశారు.

ఈ గందరగోళా లన్నింటికేమిగాని 1907, 1908 సంవత్సరములో మా రాజమండ్రి హిందూనాటకసమాజమున పార్సీ నాటకమునందువలెనే మా నాటకముల లోకూడా కొన్ని ఆవిధముగాను, కొన్ని కొంతకొంత మార్పులతో ఆహిందూస్థానీ వరసలతో స్వర్గీయ పాపట్ల లక్ష్మీకాంతయ్యగారిచే పాటలు తయారుచేయించి తర్ఫీయతుచేయించాను. మధ్యమధ్య మన కర్నాటకబాణీనికూడా కొన్ని వుండేవి. రానురాను నేటిపరిస్థితులు ఎల్లాతయారైందనగా ఎచ్చటచూచినా హిందూస్థానీ మట్లుఇమిటేషన్లుతప్ప మన బాణీ ఏచిత్రమునగాని కాన్పించుటలేదు. అనుకరణంతప్ప స్వతంత్రశక్తి నశించింది. మాటకుముందు కర్నాటకం స్క్రీనుకు బాగుండదనే సంఖ్య ఎక్కువ అయినది. ఈప్రేమవిజయ చిత్రమున మనబాణీయే పెట్టి బాగుందనిపించాలనే పట్టుదలతో మనబాణీనే పాటలువ్రాయింపించి ఆ రెండుమాసములు ఎంత శ్రద్ధతీసుకుని తయారుచేయించానో ఆఖరుకు ఆరికార్డింగు అంత అధ్వాన్నంగా తయారైంది. ఆమహాగాథ అంతా వ్రాయాలంటే వో పెద్ద పుస్తకం అవుతుంది.

అసలు విషయం ఎల్లావుంటుందో బోధపడుటకు వోచిన్న వాంశము చెప్పదలచుకున్నాను. పనిని ప్రారంభించి షూటింగుఅంతా పూర్తిఅయ్యేవరకు 1926-వ సంవత్సరమో అంతక్రితము మాడలో వొక బేబీఫియటుకారుతో పనిని అంతా పూర్తిచేయించారు. ఆకారైనా నడుస్తూ నడుస్తూ మధ్యమధ్య ఆగిపోతూవుండేది. ఆర్టిస్టులను అవుటుడోరుకు తీసుకుని వెళ్ళినా అదే. టెక్నిషియన్లకు, మేనేజర్లకు, బజారుపనికీ, అన్నింటికీ అదే. ఒక్కొకప్పుడు అవుటుడోరున దిగబెట్టిన తరువాత పనిఅయిపోయి యింటికి రావలశివచ్చేటప్పుడు కారుండేదికాదు. సరికదా ఎద్దులబండిఆయినా వుండేది కాదు. గోడ్డుపుచ్చుకోవలశినదే. దీన్నిబట్టి తదితర విషయములన్నీ చదువరులూహించుకోవలసినదే. ఇంతకష్టం ఎందుకు వచ్చినదన యిరువదిఅయిదువేలు దాటకుండా సోషల్ తీయిద్దామనుకున్నారు కాబట్టి. ఇతరులు ఎల్లా బాధపడితేనేమి. వారనుకున్న మొత్తముకన్న ఎక్కువ ఖర్చు కాకూడదు. సుమారు ముప్పదివేలు ఆప్రాంతమునవే పిక్చరు అంతా పూర్తి చేయించారు.

మొత్తముమీద ప్రేమవిజయచిత్రము రికార్డింగువగైరా ఎల్లావున్నప్పటికీ దాని సొమ్ము అది చేసుకోవడమేగాక కొంత లాభంకూడా తెచ్చిందని విన్నాను. పరిస్థితులు బాగుగ లేనప్పుడు ఎందుకు సంబంధం కలుగజేసుకున్నారని కొందరకు ధర్మసందేహం కలుగవచ్చును. మొదట్లో ఆరికార్డింగు ట్రక్కువగైరా అట్టి స్థితిలోవున్నాయని నాకూ తెలియదు. వ్యాపారరీత్యా లాభదాయకమని ఎంచి ప్రొడ్యూసర్లు దిగారు. అంతేగాని యిట్టికళకు సంబంధించిన ఎందులోనూ అసలు ఎంతమాత్రము లోగడ వారికి అనుభవంలేదు. దిగుతూనే ముందు సేతుబంధనం అన్నారు. కొన్నివేలతో అందు బంధింపబడ్డారు. అందు వీరిలోపమో ఆడైరెక్టరు రాజారావునాయుడుగారి లోపమో తెలియదుగాని కొన్నివేల నష్టంతో అందునుంచి వూడి యివతలపడ్డారు.

ఆ తరువాత మాది ప్రారంభమైంది. ఏదోఅందులో దండుగపడ్డారుగదాఅన్న బాధవొకవైపునను నాకు కలగడంవల్లను, మాపిక్చరువిషయమున, వో ఆర్టిస్టుల విషయంలోనేమి మరి ఏఏ యితర సందర్భాలోనేమి ఏమిచెప్పినను వినిపించుకోక పోయినప్పటికీ, ప్రథమతః యీఫిలింరంగంలోకి దిగడంగాన పేచీలతో భగ్నం అగుటకన్న ఏదో వొకవిధమున వారియిష్టప్రకారమే పూరిద్దామన్న తలంపునకష్టనష్టములకు చూడక పూర్తిచేయించాము.

అది పూర్తిగా నాయిష్టప్రకారం నడిచే వ్యాపారమైనట్లయితే ఆ పద్ధతులతో ఆప్రకారం ఆ చిత్రాన్ని అసలు తీయించేవుండను. కాని యిందు వొక లాభంకలిగిందినాకు. అదేమన : ఏదైనా వొకవిద్యను సవ్యమగు మార్గాన ఎవరైనా నేర్చుకొనుటకు ప్రయత్నించిన విస్తారశ్రమపడుటయేగాక చాలాకాలం కూడా పట్టుతుంది. అల్లాకాకుండా అపసవ్యమగు మార్గాన ఏఏరకంగా వెళ్ళితే ఎన్నెన్ని రకాలుగా పాడవుతుందో ఆ మార్గాలన్నీ యీఇండియన్ ఆర్టు సినీటోన్‌వారి ధర్మాన నేర్చుకున్నాను. అందుకుగాను సినీటోన్‌వారికి సర్వదా కృతజ్ఞుడనై యుండగలవాడను.

పైన కాలేజిగరల్ చార్జీ మయూనవున్నట్లు తెలియజేశాను. ఆచార్జీ రాజమహేంద్రవరమున కొట్టిశేశారు. హైకోర్టున శ్రీహనుమంతరావుగారు అప్పీలు చేశారు. అడ్మిషన్‌కోర్టులోనే కొట్టేశారు.

Printed at the Andhrabhumi Printing Works, 36 Mukatal Street. Vepery P.O, Madras.
Editor & Publisher : Andra Seshagiri Rao. B.A.